# విషయసూచిక

## పూర్వభాగము



## ఉత్తరభాగము

# రాజపోషకులు

## విద్యాదాతలు, వదాన్యప్రభుశేఖరులు

## రాజశ్రీ ఏకా ఆంజనేయులు పంతులుగారు

రాగము త్యాగముం జెలికి రాసులుబోసి, సుగంధపుష్ప సు
స్వాగతమిచ్చి సత్కృతులసారెకు బెండిలియాడి నిత్యమూ
రేగుచు దెన్నుగ్రేతలను నేలదలంచిన నీప్రసిద్ధితో
దూగెడివారులేరు బుధదూర్జటి శ్రీయుత ఆంజనేయులా.

వరహాల కావాల్య వన్నెను బడికట్టి
బస్తాలరూకల బంచినావు
సొగసైన బావాల శ్రుతులకు రాణించి
జాలెల వజ్రాల జల్లినావు
వాజూకు శబ్దాల నడకల గమనించి
అభిమాన తైలంబు నద్దినావు
కైతల క్రొత్తావి గమగమల్ ఘ్రాణించి
పసిడిపుష్పొడి నిగ్గు విసరినావు

జాతికలిగిన కబ్బమేజాతిదైన
పారవశ్యంపు దలపుల బండ్ల కెత్తి
ప్రేమసింహాసనము సమర్పించినావు
నిస్తులగుణాఢ్య! యేకాంజనేయదాత.

రక్షాదక్షసమర్థనీయ మహిమన్ రంగారు బంగారపున్
బిక్షాదాన మహర్నిశంబు కవిరాడ్బృందారక శ్రేణికిన్
అక్షయ్యంబుగ బంచి, కీర్తిరమణీ హర్ష ప్రసూనంబులన్
దీక్షాస్ఫూర్తిగ గాంచు నీచరిత ముద్దీపించు దిగ్వీధులన్.

కులుకుం బచ్చుల వాడిబాకు లోరలో గోరాడ, శౌర్యాగ్ని రా
సుల బోటొడ్డి, తెలుంగు సీమలకు నాజూకుఁ బ్రసాదించి వి
ద్యల పోషించి కవిత్వ రక్షణకు మేధాభాగ్య మర్పించి ది
క్కుల నూరేగెడి నీ నియోగికుల శక్తుల్ పూజనీయంబులౌ.

బూటకమౌ పొగడ్తలకు పొంగక లొంగక గుప్తదానముల్
నేటికి నీవు జేసినవి నెక్కొని మక్కువ లెక్క బెట్టగా
కోటికి మించియున్న యవి కోవిద, గుంపులుగా వరించెడిఁ
గాటపుకీర్తి చంద్రికల కౌగిట నుయ్యేలలూగి యాడుమా

చేరెడు గంజి ద్రావుటకు జిక్కక యేడ్చెడి పేదవారి క
న్నీరు దలంచి బిచ్చమిడ నేర్వక, తెంపున బంగ్లు బండ్లు బం
గారపు నాణెముల్ వలపు గాంతల గొంగుల కప్పగించెడిఁ
వారికి మార్గదర్శివి ప్రభావ సమన్విత ఆంజనేయులా.

కలిగినవాడవంచు, నధికారము గల్గిన మిన్నవంచు నా
ప్తుల గరుణింప గాగల ప్రపూజ్యుడవంచు నశించి పోవుక్షి
తలదయనేలు ధీరులగు దాతలమించిన దాతవంచు బ్రాం
తివితి, ప్రమోద సే వధులదేల్చుమ నా కవితా కుమారికఁ.

పేదలు కడగంటవిలుచు కన్నీటికి
ప్రేమామృతము సమర్పించినావు
కవికులశ్రేష్ఠుల కావ్యాల కలరారి
కురువిందమణులను గుప్పినావు
శరణార్థులకు దండి సాయముం బొనరించి
పరిపూర్ణత్యాగంబు బంచినావు
పేదవిద్యార్థుల బ్రియమున రావించి
క్షీరాన్న దానంబు చేసినావు

పరమసాత్త్విక భావసంపదల గురిసి
భువన కళ్యాణ కృత్కార్య భోగములకు
విలుచు నీ కీర్తి కెవ్వారు నిలువగలరు ?
నిస్తుల గుణాఢ్య ! యేకాంజనేయదాత.

కవినై భాస్వాదఖండ భోగముల భాగ్యస్ఫూర్జితక్రాంత సం
భవ సంతోష తరంగడోలికలపై పై పూలరంగండనై
భువిన్మూరేగుచు బొంగెడిన్ బదులు బాబూ ఘోరదారిద్ర్యమున్
బవలున్ రాతిరి గుందునా శ్రమలదీర్పన్ ప్రేమనర్పింపుమా.

ఆరని భక్తిభావముల యంజలితో, పరమార్థభావ సం
భారముతో గుణోజ్జ్వలిత పావనశక్తులమెచ్చి యిచ్చు నా
యీ రమణీయ కావ్యకృతి నింపుగ గైకొని, దివనాలతో
దీరిచి నన్ను బ్రోవు భువిదేవ, గుణాకర ఆంజనేయులా.



# పీఠిక

ఈ గ్రంథ నామధేయము కట్టమంచి. ఇందలి కథాంశము ప్రాధాన్యతః ఆంధ్రవిశ్వకళా పరిషదుపాధ్యక్షులగు డాక్టరు సర్. కట్టమంచి రామ లింగారెడ్డిగారి జీవితమును ముఖ్యతః వారి వంశమును, వర్ణితము. కవి సుప్రసిద్ధులైన జోసపుగారు. ఈయన నిదివరకే భారవి, కన్నీటికబురు, వసంతకుమారి మొదలైన కావ్యముల వ్రాసి ప్రసిద్ధి కెక్కినారు. ఒక గ్రంథముకంటె నింకొక గ్రంథమునందు వీరి కవితాశక్తి వన్నెలు చిన్నెలు దేరుచున్నది.

లాక్షణికుల ప్రకారము నాయక ప్రశస్తినిబట్టి, కావ్య ప్రసస్తికూడ కలుగునని, శ్రీరామచంద్ర గుణ కీర్తనములవలననే, వాల్మీకి రామా యణమునకు ప్రశస్తి వచ్చినట్లు ఉత్తమగుణ సహితుడైన నాయకుఁడు దొరకుటకంటె, కావ్యవస్తునకు శోభాధిక్యములేదని పూర్వులు. అట్లీ కవికి యుత్తమగుణవంతుఁడైన నాయకుఁడు దొరకెను.

అధునికముగ నిట్టి గ్రంథమును జీవితచరిత్ర యందురు. ఇట్టి జీవిత చరిత్ర లితఃపూర్వము గద్యమయముగా నున్నవి కాని, పద్యమయ ముగా లేవు.

కవి గొప్పవాడై నాయకుఁడు గొప్పవాడైనప్పుడు బంగారమునకు సువా సన యబ్బినట్లే! ఈ కావ్య నాయకుని గొప్పతనము, వివరించరానిది. అధునాతనాంధ్ర మహాపురుషులలో రెడ్డిగారు మహోత్కృష్టులని చెప్పిన కాదనజాలువారుండరు.

వారి యాంగ్లేయాంధ్ర భాషాపాండిత్యములు జగత్ప్రసిద్ధములు. రాజకీయ విషయ వేతృత్వము నికషప్రాయమైనది. ఆయన కవి, పండితుడు, అర్థశాస్త్రవేత్త, గొప్పవాగ్మి, ప్రతిభాశాలి, బహుజనుల కాదర్శప్రాయుడు, భాషా పోషకుఁడు. ఆయనవద్ద నెన్నోని సద్గుణములు కలవు. కావ్య నాయకులుగ కావలసిన సత్కులీనత అవికత్థనత, శౌర్యము మొదలైన మహాగుణములు కలవు. ఇట్టి నాయకుని తీసికొని కావ్యరచన చేసిన జోసపుగారి కవితా గుణము లెట్టివి?

అధునాతన కాలమున భావకవిత్వమని యొక విధమైన కవిత బయలు దేరినది. ఈ కవితా లక్షణము లెట్టివి యని విస్పష్టముగ నిర్ణయించుటకు వీలులేదు. కాని స్థూలముగ నిట్లుండునని చెప్పవచ్చును. ఇట్టి రచనకు మూలపురుషుఁ డాచార్య రాయప్రోలు సుబ్బరావుగారు "కృష్ణాతరంగ పంక్తిం ద్రొక్కి త్రుళ్లింత నాంధ్ర నౌకలు నాట్యమాడునాడు."

"విద్యానగర రాజవీధుల కవితకు బెండ్లి పందిళ్లు కప్పించునాడు." మొదలైన రచనలో నీ భావకవిత్వ లక్షణము స్థూలముగా నున్నది. ఆంధ్రులయు, భారతీయులయు పూర్వౌన్నత్య ప్రశంస దినికి ముఖ్య లక్షణముగా గనుపించుచున్నది. రచనలోకూడ నదియొక యొయారము విలక్షణముగ భాసించుచుండును. సామాన్యపు భావమునుతీసి, మెత్తని మాటలతో చమత్కారముగా చెప్పుట మరియొక లక్షణము. పూవులు, నదులు, కొండలు, సెలయేళ్ళు మొదలైన వానిని గూర్చి ప్రకృతి రామణీయకమును వర్ణించుట యింకొక గుర్తు. మరి శబ్దములనుగూర్చి దేశములో యాసగా వాడు కొన్ని శబ్దములను, నిరభ్యంతరముగా వాడుట. 'ప్రౌఢకావ్యంబుల ప్రతిఫలించి గమించు, నిక్కచ్చిరసములో నిగ్గుతీసి' యిందులోని నిక్కచ్చి శబ్దము దీనిని పూర్వకవులు వాడరు. గ్రాంధికులు వాడరు. ఈ శబ్దమును వాడుటచేత నర్థము చమత్కృతము కాలేదనుటకు వీలులేదు.

'నాగమ్మ పుంజులో నలిపిపోసిన వీరపద్యాల తమ్మట బారుదీర్చి' ఇట్టిది పూర్వప్రశస్తి చెప్పనది. గుమ్మెట కదలరేపి, తమ్మటబారుదీర్చి బుజ్జిలతట్టిరేపి, గజ్జెరవళిరేపి, ఈ శబ్దములు నాలుగు సీసపద్య చరణాంతములు. అన్నియు విలక్షణములైన శబ్దములే. దేశకథలు జెప్పెడు జంగముల సాధనములు. ఇది దేశికవిత్వమును ఆలంబనముగ తీసికొని, గ్రాంధికమర్యాద లొత్తుకొన్న కావ్యపద్ధతి.

కాని, భావకవిత్వమున కొక లక్షణ మున్నది. ఇట్టి యెత్తుగడ పది పదునొకండు పద్యాలు దాటి యెప్పుడును పోలేదు. ఆ కవితా మార్గమునకు దాటిపోవు శక్తి లేదు. కాని యిది అట్టి రచన వందలకు దాటిపోవునట్టి రచన. ఆ పద్ధతిగ చేయుట జోసెపు కవిగారి అనంతప్రతిభ యని చెప్ప

వలయును. ఈ కావ్యములో షుమారు నాలుగువందల పద్యములు. సగానికి సగము సీసపద్యములు. ఈ సీసపద్యములలో నూటికి తొంబది ఈ భావకవిత్వపు నడకనడిచినది. మరియు ననేక వృత్తము లందుకూడ నీ భావకవితాలక్షణమున్నది. అది యొక యొయ్యారము. మాటలు కూర్చుటలో నొక సౌకుమార్యము, నొక వైలక్షణ్యము సంధానపఱచుటయే దీని ప్రధానాంశము. ఈ రీతిగా కావ్యమంత వ్రాయుట యాశ్చర్యము. శక్తిలేని దానిలో ననంతశక్తి సృష్టి జేయుట.

ఈ దృష్టితో చూచినచో నిట్టికావ్య మధునాతన కాలమున పూర్వము పుట్టలేదు. మరియు నింకెవరో వ్రాయుదురనుటకు కూడ సాధ్యము కాకుండనున్నది. ఈ చెప్పిన నామాట, యాధునిక భాష కవితామార్గ రహస్యవేత్తలకు మాత్రమే తెలియును.

ఈ కవికి యాధునికులలో నభిమానులైన కవు లున్నారు. వారిలో శ్రీ దుర్భాక రాజశేఖర శతావధానిగారు, శ్రీ కొడాలి సుబ్బరావుగారు, శ్రీ జాషువకవిగారు, ముఖ్యులుగా గనిపించుచున్నారు, వారి రచనలలోని కొన్ని యెత్తుగడలు, పోలికలు నీ కావ్యమునందు గనుపించుచున్నవి.

ఈ కవి మంచి పండితుడు. పరులు వాడని యనేకములైన శబ్దము లీ కావ్యమునందు వాడబడినవి. ఒక్కొక శబ్దములు వాడుటయు, కవియొక్క ప్రతిభాలక్షణమని పండితులొప్పుకొన్నవిషయమే.

ఇంక, సీయిన నాయకుని నెట్లు చిత్రించెనన్న విషయము. ఒక్క విషయము చూపించినచో నీ కవియొక్క దృష్టి తెలియును.

అనవద్య రాజశ్రీయుఙ్జ్ఞాన శుభభేరి
మ్రోసి స్వాగతమంపె వ్యాసమౌని
అఖిలవేదాది విద్యాసార సామ్రాజ్య
భద్రపీఠమునంపె వనజభవుండు

తర్కార్థశాస్త్రవితర్క ప్రభాదక్ష
　　విజయధ్వజం బెత్తె వేల్పుటొజ్జ
పంచాక్షరీమంత్ర భద్రముద్రాంక కి
　　రీట మర్పించె వాల్మీకి సుకవి

వర సుభాశీర్వచన పరంపరలతోడ
భూరి కళ్యాణ విమల కర్పూర గంధ
హారతుల దిగ్గజంపు టంబారిపైన
గట్టి పంపిరి యష్ట దిక్పాల వరులు.

'కట్టిపంపిరి యష్టదిక్పాలవరులు' ఈ పద్యమువలన కవియొక్క పద కము దెలియగలదు. ఇది పురాణపద్ధతి పురాణములలో, కుమారస్వామి, విఘ్నేశ్వరుడు మొదలైనవారు జన్మించినపుడు సర్వదేవతలు, వారికి తమతమ శక్తుల నొసంగినట్లు వ్రాయుదురు ? ఇదియునట్లే యున్నది.

　　తెలుఁగురాతేడు గద్దెపయి బరతపిట్ట,
　　శోకించు రచనలో సొమ్మసిల్లి

ఇది కొడాలి సుబ్బరావుగారి, యందలి యభిమానము.

రెడ్డిగారు విదేశములకు పోవుచున్నపుడు తల్లి చెప్పిన మాట లన్నియును కవిచెప్పినవి. దేశమును మనస్సులో నుంచుకొని చెప్పినవి.

ఈయన సంస్కృత సమానపు కూర్పుకాని, తెలుగు పదాలకూర్పుగాని, యొక విలక్షణమై మనోహరమై యొప్పారు చున్నవి.

సడువులేని పదాల చందమామ పదాలు
　　కళల పింజెలను వాములబిగించి
తీయఁదలంపుల తేటకైత రసాలఁ
　　దెలుఁగుఁ గలాల మూతులకు ద్రాపి

ఈ రచన యేదో వెన్నెలలో షికారు పోయినట్లున్నది.

కావ్యమంతయు నిట్లున్నది, ఇంక సంస్కృత సమాసరచన చూచినచో, "సరసాంతః కరణాబ్జగంధ నిరతిఁ సాహిత్యసామ్రాజ్య నిర్భరరత్నాంచిత సింహపీఠికల నారాధించి," "వా గర్దంబులలో మరందనిభ సద్భావ ప్రవాహంబు" ఈ సమాసముల కూర్పు గుజ్జపుస్వారి చేసినట్లుండును.

ఈ కావ్యమున శ్రీ రెడ్డిగారిప్రతిభ యొకటివచ్చి వేరొకటి రాలేదనుటకు వీలులేదు. ఆయన మేధావిశేషము, బాల్యమునాటి చురుకుతనము, చదువులో నందరికంటె పైచేయి అయియుండుట, కుశాగ్రబుద్ధి యివి అన్నియు, లోకమునకు తెలియనివి. జీవితకథ వ్రాయుచున్నాడు గనుక ఈ కవి పోయి కనుగొని యిందు సమకూర్చినాడు. శ్రీ రెడ్డిగారి స్నేహితులవలన ననేక విషయముల తెలిసికొనినాడు. శ్రీ రెడ్డిగా రన్నచో దైవముగా పూజించువారు, దేశములో నెందరో కలరు వారంద రీగ్రంథము శ్రీ రెడ్డిగారి గుణగణ వర్ణనము చేయుటయందు మిక్కిలి యుపయోగించునని చెప్పకతప్పదు. నిజముగా నీ కవి తన్మయుడై వ్రాసినాడు.

"నే నశ్రాంత మనంత భక్తిబలముఁ నీదివ్యరూపాధిక
జ్ఞానంబారసి పారవశ్యమున నెంతఁ గొల్వగానుంటి నీ
వే నేనైతినో ? నేనె నీవైయితో ? భావింపంగ నీపైన నీ
ధ్యానంబింటుపుట్టి పొంగుటకు భూపా ! రామలింగప్రభూ."

ఈ పద్యముతో యెట్టి తన్మయత్వము చెందెనో తెలియును. ఇట్టి యుదాహరణ మన సారస్వతములో లేదు. ఇంగ్లీషుభాషలో డా. జాన్సన్ను గురించి వ్రాసిన బాస్వెల్ ఉన్నాడు. కాని ఆ పద్ధతి వేరు. ఈ పద్ధతి వేరు శ్రీ రెడ్డిగారిని గూర్చి ఆ పద్ధతిగాకూడ వ్రాయవచ్చును. రెడ్డిగారి కున్న ప్రతిష్ఠలలో నన్నిటికంటె గొప్పది వాక్చమత్కృతి.

ఈ కవియు ఈ కావ్యనాయకుడును, ఇద్దరు కృతార్థులు.

బెజవాడ.
6-12-47

విశ్వనాథ సత్యనారాయణ, యమ్. ఎ.

# FOREWORD

Mr. G. Joseph is a great Andhra poet whose works are read with unabated interest by Andhras.

He is the author of Bharavi, a poetical work highly appreciated by the enlightened public. *Kaneeti Kaburu,* is his master piece ominously picturing the hardships and horrors experienced by the downtrodden *Harijans.*

The poet has recently finished his voluminous work *Kavi Chakravarti* a poetical work about the history of his Exalted Highness the Nawab, Mir Usman Ali Khan Bahadur, the illustious Ruler of Hyderabad (Daccan).

Mr. Joseph Kavi has written the biography of Sir C. Ramalinga Reddi, M. A., (Cantab), the renowned Vice-Chancellor of the Andhra University (Waltair) and the learned poet has placed me in an awkward position by asking me to write the 'Foreword' to this valuable production, which should have shone more briliantly if a more accomplished penman had written it.

Sir C. R. Reddi is the most eminent of all the literary luminaries in Andhra Desa.

There are, at the present day, hundreds and thousands of Biographies in all languages. But his, is one of the best few in all respects.

It gives me immense pleasure and statisfaction that the life of this illustrious son of *Bharat Mata* has been written by *Kavi Sekhara* G. Joseph whom the Rayala Seema Kala Parishad has recently honoured very highly.

The aim of a biographer always is, to seek after truth. I am satisfied that the author has strict and close adherence to truth.

Sri C. R. Reddi is one of the most beloved sons of Muses. He has dug out nuggets of gold from the bowels of mines learning. In a word he is an intellectual Dynamo.

His very breath is education. The whole country lies under a deep debt of gratitude and obligation for all the meritorious services he has rendered in the best interests of the country. He is indeed in both English and Telugu - a great authority on Literature. He the first Andhra, as the President of the Inter-University.

Mr. Joseph has delivered goods most opportunely in the most admirable manner. The book is full of sublime panoramas of literature.

All the brelliant changes and improvements which this celebrity made in various branches of education in South India, the amount of his sincere and intelletual labour in maintaining the great University, Reddi's struggle to uplift both classes and masses, the superb grandeur of his

*Shasti Poorti* celebrations under the presidency of H. E. Sir Arthur Hope (then Governor of Madras) are all depicted in so picturesque a language that the grand picturesque matter can parade eternally before the mental eye of the reader.

Sir C. R. Reddi has done immense justice to the saying "The poet is the highest specimen of his age" and he has so magnanimously conducted himself that every day of his life has become a bright page in his heroic history. He is one of the nobelest specimens of the Almighty's work. His highest ambition is the attainment of educational perfection coupled with the economic salvation in the Mother Land.

Sir C. R. Reddi, occupying as he does, an eminent position in the educational field, is expected to work miracles ere long under the national Government.

It is always a difficult task to write biographies of great persons, successfully. But the esteemed author conducted himself with admirable tact and precision in dealing with various complicated details of his life and thus rendered the great work very beautiful and attractive.

Nothing would give me greater pleasure than to see this valuable work prescribed as a text book by the Authorities in all the Universities of South India..

Life-sketches of this kind are yet very few in Andhra Desa. This life-sketch is magnificently and magnetically powerful enough to inspire the reader into any aesthetic and patriotic actions in no time. Our hero is no ordinary man. If he had been born in England he should have been another Atlee and born in America, Another Truman.

Even the author's maiden efforts in this direction are a complete success. And I therefore offer my sincerest greetings, felicitations and congratulations to him.

May the Almighty God shower His choicest blessings on our Reddi, who is the poet–Laureate of the Nature's Court. "May Sir C. R. Reddi be spared long" is the heart-felt prayer of.

*His most sincere admirer*

PRODDATUR

Kavi Sarwabhouma

**D. Rajasekhara Satavadhani**

# కృత్యవతరణిక

శ్రీరాజిల్లగ నిత్యమంగళ యశశ్శ్రీ సింహ పీఠంబుపై
గారుణ్యంబున గొల్వుఁదీఱి, దిశలం గోఁగింట నాడించెడిన్
ధీరోదాత్తుఁడు వేంకటేశుఁడు శుభ స్నేహంపు టభ్యున్నతుల్
తారాడం దమినేలు గాత ఘన సీతారామచంద్రప్రభున్.

అతుల ప్రాభవమూర్తియై, వితరణ వ్యాపార దీక్షా మహో
న్నత చాంపేయప్రసూనమాలల సుగంధశ్రేణి గుంఫించి, యా
శ్రిత దుర్దాంత విపద్దశాశ్రుజల నిశ్శ్రీకంబు జెండాడి ద
క్షతఁ గీర్తింగనె వేంకటప్పయ, బుధుల్కాంక్షించి శ్లాఘింపగన్

మించిన భక్తిభావముల మేదుర శక్తుల మీదుఁగట్టి, రా
ణించి చలించు నిస్తులిత నీతుల నిక్కపు వజ్జిరాల గు
ప్పించి, జగద్ధితాధిక వివేకచరిత్ర గడింపగాఁ ప్రతి
ష్ఠించెను వేంకటేశుఁ డభిషేక మొసంగగ దేవళంబులన్.

అమ్మహాపూజనీయుని యనుపమాన
తపము మహిమచేఁ గలిఁగిన తనయులందుఁ
బ్రథితగుణుఁడు సీతారామపార్థివుండు
కీర్తిఁగాంచి దిగ్దంతులఁ గ్రీడసలిపె

తానుగవీంద్రుఁడై, సుకవిధన్యుల బంగరు బూలవానతో
దానములాడఁజేసి, కవితాసతినెంతగ బ్రస్తుతించి వి
జ్ఞాన కుశాగ్రబుద్ధి నిపుణత్వ మహత్త్వము దాండవించి పెం
పూనిన భక్తిసంపద మహోన్నతిచే విహరించె దిక్కులన్.

అమితదయాలవాల మగునట్టి చరిత్రల బూజచేసి, సం
యమివరుఁ దుల్యభావనవిహాయససీమల పుష్పరథ్య భా
గముల బచారుసేసి, కడగండ్లను నశ్రులజిందు పేదలన్
తమిఁకనిరక్షసేయుటకు దార్కొనె? కర్ణనిమించు త్యాగమున్.

తిక్కన నన్నయాది కవిధీరులుముగ్గురుపోతరించి, పెం
పెక్కిన జ్ఞానగంధముల యేపునవ్రాసిన భారతంబుఁ దా
నొక్కఁడె యేకకాలమున నున్నతశక్తుల నెక్కుపెట్టి సొం
పెక్కఁగ వ్రాసి కీర్తిఁగొనియెక్కె చరిత్రలు స్థానమీయగన్.

సతియై భక్తిమహత్త్వమున్ కవుల కాంతాదీక్ష నీడేర్చుచున్
తతసౌశీల్యమునింపి, పెంపొలయు 'రాధాదేవి' ప్రేమైక సం
తతిచే ధీరుఁడు పూజనీయుఁడును సీతారాముఁడానంద పా
త్రతచేఁ గాంచెను నొక్కపుత్రకుని సీతారామచంద్రప్రభున్.

కరుణాసాంద్రుఁడు కర్మవీరుఁడు యశఃకల్యాణలాభైక సం
స్మరణీయాంచిత పుణ్యచారితుఁడునై, సర్వంకష ప్రజ్ఞతో
ధరదీనావన రక్షకుండునయి, సీతారామచంద్రప్రభుం
డరయన్ ద్యాగముఁగ్రుమ్మరించె, బుధులాహ్లాదంబు సంధింపగన్.

దయఁజూపినాఁడు పేదల జాతకంబుల
బరికించి ముంగొంగు బసిఁడిగురిసి
కరుణించినాఁడు దుర్భరశాత్రవుల దప్పి
దంబుల జిదిమి యత్తరులజిలికి
రక్షించి నారలార్తశరణ్యుల వరించి
తమిఁ గనకాభిషేకము లొసంగి
పాలించినాడు నిర్భాగ్యుల చరితల
దర్శించి జిలుగుఁ గుందనము విసరి

అమృతమయమైన ప్రేమహృదబ్జమందు
నిండి తొణకించి పొరలు తేనియలజల్లు
దిశల విరజిమ్మి పేదలు దేజరిల్ల
శక్తినింపె సీతారామచంద్ర విభుఁడు.

సరవిందాన గుణాభిమానముల పజ్జఁ బక్తితాత్పర్య బం
ధుర ప్రేమాంచిత కావ్యరాజముల నెంతో దీక్ష సృష్టించి, వి
స్తరతఁ బెద్దలుదిద్ది తీర్చిన ప్రతిష్ఠాదేవి పాదాబ్జముల్
స్మరియించుం బొలివోని త్యాగపరిణామస్ఫూర్తి రాణింపగన్.

అభ్యాగతుల ప్రార్థనాలించి పోషించు
జ్ఞానమేదాతకు సహజగుణము
కడగండ్లఁబడి గుందుబడుగుల రక్షించు
యుపకారమేదాత కుగ్గుఁబాలు
భూతదయారక్ష భోగమేదాతకు
యతులితాభ్యస్తంబునైన విద్య
అపహాసమునకైన నన్నృతంబు బలుకని
తత్త్వమే దాతకు తగుధనంబు

అతడు కాళ్ళూరి కులకలశాబ్ధి సోముఁ
డతులితానంత ధర్మ విహారమూర్తి
రాజితయశస్వి! సత్కవిరాజరాజు
పూజితుండు సీతారామభూ విభుండు.

దానకళాకలాపముల తత్త్వనిరూఢికి నాలవాలమౌ
మానసపీఠులం దనుపమాన నిసర్గపరోపకార దీ
క్షా నియమప్రకాండముల కాంతులు బాతరలాడు, నిద్రలో
నైన దలంపఁ డన్యులకుహాని జెమర్చెడి క్రూరకృత్యముల్.

దెసల వాసించెఁ దదీయ విసృత ధర్మ
కార్యాల మల్లికాగంధ మహిమ
కవుల మేల్కొల్పెఁ దాఁ గట్టిన సత్రాల
నర్థిసంతోష వీణాదిరుతము
ప్రభఁగాంచెఁ దాఁ గొన్న వరకృతి కావ్యాల
కీరితి మేలు కర్పూరరజము
వికసించెఁ దన దానవిశ్రుత సత్కార్య
ముల కమ్మదనముల మొగిలితోఁట

తతవదాన్యత నందనోద్యానసీమఁ
బ్రకృతి రచియించు ధర్మకావ్యాల జదివి
తేగమువెలార్చి తెలుగింటఁ దేజరిల్లి
ప్రముఖుఁ డయ్యెను సరివారు ప్రస్తుతింప.

నవ్వుచుబల్కుచుండు, వదనంబున దానకళాభిమానముల్
మవ్వపుసంజ్ఞతో గులికి మార్కొని బాతరలాడు, దీనులఁ
జివ్వన జేరదీసి యభిషేక మొసంగును, శాంతివార్థినిం
ద్రవ్వ కొలంది వెల్వడు ప్రధాన యశోగుణరత్నసంతతుల్.

అతని జిహ్వాంచలమున విద్యా వధూటి
దివ్య కళలుట్టి పడగ నర్తించు చుండు,
దీప్తిఁదళు కొత్తు దృక్కుల తీరులందు
పాఱుచుండు దయా మేయవార్ధు లెపుడు.

కలిమిఁజొక్కపుగుంకుమాగరులసింగారించి, క్రొంజాయ ని
గ్గులు దళ్కొత్తెడి జాళువాపసిఁడిఁ రేకుల్ సొంపు నింపార గా
జిలు గుంగైతలఁబ్రోవనై తలఁపు దేజీనెక్కి దిగ్దేశ భూ
ములహాయిఁ విహరించుతత్ప్రతిభతో బోల్పంగలే రెవ్వరుఁ.

తెలుఁగు వనంబులోన నునుదీపు పదాల చివుళ్ల మెక్కు కో
యిలయయి, భావ గీతల జయేందిరనవ్య విపంచి కా శ్రుతిఁ
బలియుచు సత్కవీంద్రుల ప్రపూజ్యపువాక్కుల దాండవించి ది
క్కుల వలపించెఁ గిరితిసకుల్ బిగి గౌఁగిట ముద్దు లాడఁగన్.

మవ్వంపు బలుకుల పువ్వుల పుప్పొడి
వలపు గాడ్పుల సెజ్జఁ బవ్వళించి
పరువంపు నాజూకు భావాల తోరంపు
వజ్రాల పందిళ్ళఁ బరువు లెత్తి
పరిపక్వరస సుధావార్ధివీచీ డోలి
కామాలికల పొత్తుఁ గౌఁగిలించి
పురిపెంపు నడకల మెఱుగాఱు తొలుకాచు
మెఱుపు టిల్లాంద్రతో మేళవించి

తెలుఁగుబొలమున గడిదేఱి వలపుగులికి
కమ్మకై తలనెత్తావి గుమ్మలందు
దవిలి కొసరింపు భావగీతముల బాడు
చలరు తనకీర్తిఁ గొలబట్టగలరె భువిన.

అలరుంగైతల బూలపందిరుల యందానంద సౌభాగ్య వే
దుల నాసీనయునై ప్రశస్తగుణ విద్యుద్దీప సందోహ పా
త్రల వెల్గించి యశోమహత్త్వమున 'సీతారామ' రాజ్ఞీమహా
పుత్రుల ప్రేమించుచు, బూజసేయునిజవాధున్ భక్తిసంరంభమునన్.

తనగర్భంబు ఫలింప కున్కి ఘన సోదర్యుండు గోపాల భో
జుని ప్రేమైక కుమారు రుక్మధరునిం జొక్కంపు భావంబుతో
గొనియోజాదత్తుగ, వంశపుంజరితలన్ గ్రొంగ్రొత్త తేజంబుతోఁ
జనవున్ బూజలుసేసి శాశ్వత ప్రతిష్ఠాజ్యోతి వెల్గింపగన్.

రామలింగయరెడ్డి విరాజమాన
మూర్తి చరితంబు రచియించి పూర్ణభక్తి
సాముకవితోడ నమ్మహాస్వామి సంస్థ
జేరి స్తుతియించి కృతిఁగొనఁ గోరుటయును.

ఆయత హర్షపూరిత దయామయ దృక్కుల జిమ్మ, తోడనే
ధీయుత రామకృష్ణప్రభు ధీరునితోఁ గమలాంబదేవి సా
హాయకముల్ సభల్ జరిపి, హాయిగ ముద్రచితంపు గావ్య పా
రాయణ భాగముల్ వినియు రంజిలు భక్తిన పారవశ్యులై.

అతులిత భక్తిసంపదల హారతితో నను గౌరవించి, స
మ్మతి పరిపూర్ణభావముల మార్కొనజేసి సువర్ణకంకణ
ద్యుతులు వరించి నాకయిత తొయ్యలిప్రేమ బచారుసేయగా
గృతిఁగొని పూజనీయునిగ రేపెను దిక్కులు మాఱుమ్రోగగన్.

ఎంతకాలంబు దిగ్దంతి దంతాలపైఁ
భూదేవి యూరేగి మురియుచుండు
ఎంతకాలంబు దినేశాదిగాఁగల
గ్రహదేవతావళి గ్రాలుచుండు
ఎంతకాలంబు సర్వేశ్వరుఁ డింపుమై
దీనావనము సేయఁ దిరుగుచుండు
ఎంతకాలంబు మహేంద్రాది దేవతల్
లీలతో భువిని బాలించుచుండు

రంతకాలంబు కాళ్లూరి యన్వయాగ్ర
గణ్యుఁడౌ రామకృష్ణ భూకాంతుఁ బ్రేమఁ
బ్రధితుఁడైన సీతారామ పార్థివుండు
ఆయురారోగ్య పుత్రపౌత్రాభివృద్ధిఁ
గలిఁగి పాలించు గాత నీ జన్మతలంబు.

—-—

## కట్టు పంచి

భువన లక్ష్మీ శ్రీగళంబునఁ గనుల్ మిఱుమిట్లు
గొంబపు నష్టాపదోజ్జ్వలిత భూష
పూర్వార్ధ గోళంబు భూదేవి మేనఁ జె
ల్వారు రంగారు బంగారు రవికె
యూరేషియా నవాంభోరుహదళ నేత్ర
యద తెలుంగని దొడ్డ హృదయకోశ
మాశియాఖండ దివ్య యశోమహోన్నతి
విశ్వంబునకు జాటు వీరఘంట

ఖండమాత్రంబె! యతులితాఖండభరత
ఖండ మఖిల ప్రపంచ భాగ్యములు గలిసి
వచ్చి యొకచోటఁ జేరిన పగిది వెలయు
దాని కెనయైన దేశ మీ ధరణిఁ గలదె!

బ్రహ్మాదండమున శాత్రవు నస్త్రశస్త్రముల్
పాఱమ్రింగిన మహాప్రాభవాఢ్య
లంబుధి తోయ చయంబెల్ల నఱవేత
నాపోశనము గొన్న యలఘు బలులుఁ
సురరాజుతోడ మచ్చరమూని సృష్టికి
బ్రతిసృష్టి నెఱపు దుర్వారమతులు
పశ్యల్లలాటుతోఁ బ్రతిఘటించుచుఁ గాలఁ
గన్నుఁ జూపిన మహోగ్రప్రభావు

లత్యమర్షాగ్ని సర్వలోకాళిఁబట్టి
భస్మ మొనరించు నతులాత్మ బలసమగ్రు
లీవిశాల విశ్వంబు నందెందుఁ గలరు ?
భళిరె! యొక్క యార్యావర్తవసుధఁ దక్క.

పరమ పవిత్రమౌ ప్రఖ్యాత గోదావ
 రీ మహాదేవి వర్తించు తావు
అల చతుర్దశలోకములు సంస్తుతించు కృ
 ష్ణానది వర్తించు నాట్యశాల
ఆకాశ గంగ కీడగు నుత్తర పినాకి
 నీ నదిఁ గనిన పుణ్యముల ప్రోవు
లవణాంబు రాశి మేల్పడి యేలు దేవేరి
 కావేరి ప్రవహించు కనక సీమ

స్వర్ణముఖ్యాది బహునదీ వర విశుద్ధ
తోయ సంక్షాళి తాఖిల దురిత చయము
పరిణ తామోఘ దివ్య వైభవములందు
రమ్యసురధాని మదరాసు రాజధాని.

కాళీ పురమ్మున గన్న మిన్నయటన్న
 ప్రఖ్యాతిఁ గన్న తిర్పతిపురంబు
స్వర్ణముఖీనదీ జలపూత పదమై జ
 గమ్ము నోమెడు నట్టి కాళహస్తి

మును చరిత్రను బ్రసిద్ధిని గాంచి నేఁటికి
సద్యశంబు రహించు చంద్రగిరియు
దక్షిణ కాశి నాఁదగి కుమారస్వామి
కి, నివాసమగు తిరుత్తని నగరము

నలరి యంగుళ మంగుళం బతి పవిత్ర
మగుచు భూదేవి కర్ణంబు నందగించు
వజ్రమయ కుండలంబు శోభా విశేష
మండలంబగు చిత్తూరు మండలంబు.

కీరితికమ్మ కప్పురపుఁ గిన్నరసానులమల్లె పూలసిం
గారపు దోటలోఁ దెనుఁగుఁ గత్తికి సాములబూజ నేర్చి వి
స్తార జయేచ్ఛతోఁ బ్రతిభఁజాటిన రాయలప్రేమఁగొన్న చి
త్తూరు వెలుంగుఁగ్రొంబసిఁడి తోరణముల్ గల సౌఖ్యగేహమై

నెచ్చెలియై వదాన్యగుణ సీతుల గ్రొంబువ్వుజంటి తేనెతో
నచ్చపుఁ బచ్చిబంగరపుటంజలికానుక పచ్చఁబ్రాలతోఁ
జెచ్చెఱ బిచ్చగాండ్ర కభిషేక మొనర్చుచుఁ గట్టమంచి పె
న్మచ్చిక మచ్చులంగురియుమానిత మేపురి యొప్పునచ్చటన్.

కలిమిఁ దులదూగుసద్ది యాకారమునకు
జిన్నదియునయ్యు, నిర్మాణ శిల్పమునను
జక్కదనముల నెలనాఁటి చందమామ
శిల్పి, పనితనమున సొంపు జిందువాఱు.

పడమరదిక్కు క్రొత్తరఁగ పాన్పు హొరంగుల స్వర్గసీమతో
మరియు తటాకమొండుజిగిముద్దుల నవ్యోలపూలుబూయు, ను
త్తరమున నేత్రపర్వము ముదంబుల సొంపుల ద్రుళ్ళదూచు ని
ర్భరమొక యేఱుపారునట, రమ్యత రాధిక ఫేన పంక్తితో.

తెలుఁగు టుఁలులవాఁడి మలుఁపున బరదెంచు
  స్నిగ్ధభావాల సృష్టింపఁజేసి
తెలుఁగు సుత్తెలమొనఁ దలపించు నాజూఁకు
  జిలుఁగు నేరుపుఁ బ్రదర్శింపఁజేసి
తెలుఁగుఁ గలంబులఁ బొలయించు రంగుల
  సొగసుందనపుగుట్టు చొఱవెఱింగి
తెలుఁగుఁ గుంచియలందుఁ బొలయించు నూనూఁగు
  కులుకుఁ జాజులసిగ్గుఁ గుమ్మరించి

దీప్తిఁ జెన్నారఁగట్టిన దేవళములఁ
జోళుల ప్రతిష్ఠఁ దెలుపు శివాలయంబు
మనునిగన్నయ్య, వెనకయ్య వరదరాజు
రాము దేవళాలప్పురిఁ బ్రతిభలీను.

అంతములేని సోయగపుటామనితోఁ జెలువొందు తత్పురీ
ప్రాంత పరీతభూముల, విరాజ సుమప్రమదంబు నిత్య వా
సంతిక భాగ్యమై, పుడమి జవ్వనిముద్దుల కాన్పులన్న వి
భ్రాంతి జనించు జూపఱకు భావపరంపర లార్భటిల్లగన్.

పూచిన గొండమల్లియల పుప్పొడిదుమ్ముల దిన్నెలందు దో
బూచులనాడి, కెంజిగురు ముద్దియలందపు టెజ్జడాలు కా
ణాచిని గౌఁగిలించి, పరిణామము సెందిన కమ్మతావులన్
రేచుచుఁ బిచ్చలించి విహరించు నొయారపు లేఁతగాడుపుల్.

అలపడి గున్నమావి జిగురాకుమొఱంగుల తిండిమెక్కి పు
వ్వుల పొడిసెజ్జలోఁ బ్రణయభోగసుఖైకత జెమ్మరించి, ని
ర్మల నవదక్షిణానిల తరంగపుటూయెలఁ ద్రుళ్లితూఁగి ది
క్కుల వలపించు కంఠములగూయు పికంబులు పంచమశ్రుతిన్.

మావి చివురుమెక్కి మత్తెక్కి గీతికల్
పాడుకోకిలల గోలాహలములు
పక్వఫలాహార పరవశతను, గీత
ములు వల్కు చిలుకల కలకలములు
తమిఁజెలరేఁగి పించెము విప్పియాడెడు
ఘన మయూరముల కేకారవములు
మధుపానమత్తత మధురగానముల నె
మ్మదిఁ దన్పు కొదమతుమ్మెదల రొదలు

అమృతమయమైన జలము నిండారఁ గలుఁగు
సదమల సరస్తరంగ నిస్వనముగూడి
దెసలు మార్మ్రోయ, వనలక్ష్మి తేజమొంది
మీసరము లయ్యె వాసంత వాసరములు.

నన్నపార్యుని గైత నాజూకు జొంపాల
హంస తూలికల శయ్యలను బొరలి
కాళిదాసుని చమత్కారోప మానోప
మేయంపు టుయ్యాల హాయిఁదూఁగి
తిక్కన్న వలపుల తేటమాటల తెల్గు
విరజాజి పందిళ్ళ మురిసియాడి
రామభూషణు శ్లేష రత్నాల గద్దెపై
గొనబు దర్జాలతోఁ గొలువుఁదీఱి

సూరనార్యుని బలుకు కొటారులందు
నచ్చపుంగీర్తి వజ్రాల నారఁబోసి
తెలుఁగు జెట్టీలతోడ విదేశములకు
విక్రయింపను బంపించు వెలమతించి.

విరజాజిపూలకు మురిపంబు బొసగించి
కులుకు పల్కుల నవ్వుకొనుచు మురిసి
పీచుపీచుల లేమి పిల్లలగడితంపు
వేడ్క త్రుళ్ళింతకు విసిగి వగచి
బుడుతలిబ్బి పడంతి బులిపించి కడగంటఁ
జిమ్మెడి చిరునవ్వు సిగులకలరి
పరువెత్తు క్రొత్తావి పందెంపు గుఱ్ఱాల
పరువంపు ఠీవి కబ్బురముసెంది

ప్రేమ కర్పూర సురభి మూర్తీభవింప
నిండుకీరితి పండు వెన్నెలలయందు
దెసఁగు వజ్రాలగద్దెపై దేజరిల్లి
యుంచితానందమున గట్టమంచి వెలయు.

## వంశము

పులిపురుటాలి యబ్బురపుఁ గన్నుల క్రిక్కి
రిసియు నెట్టమబ్బులఁ గ్రీడసలిపి
మగమానికపువాలు పగటువాదరతళ్కు
రచ్చపట్టుల గసరతులనేర్చి
మగపాడి రతనాల తగుటు వన్నెలనీటు
గెలుపుగన్నెల నవ్వు విలువఁగొలిచి
పగఱ నెత్తుటివాన వరదల బలితంపు
సమరాన వీరవసంతమాడి

తూరుపుసముద్రమంతకు దొంగిలించు
భరతభూముల పచ్చిబంగరు బయళ్ళఁ
బ్రభల జాటించి తెల్గుహారతుల గాంచి
శ్రీలఁగాంచిరి రెడ్డిభూపాలవరులు.

మానవలోకమందుఁ బరిమాణము దూకముబట్టరాని క
ల్యాణ యశోధికప్రవణ లంబసమీరతుషారహార స

న్మానములందుచుఁ వితరణ ప్రకటస్ఫుట హేమకింకిణీ
ధ్వాన పతాకలెత్తిరి ముదంబున దిక్కులు బిక్కటిల్లగ౯.

అన వేమ భూపాలు హస్తాబ్జములనుండి
జిందిన పేరిమి సిరుల పసుపు
వీరనాయకురాలి పౌరుష గాథలోఁ
బొడిచిన యుద్రేకముల ప్రశస్తి
వేమనమౌనీంద్ర విరచిత గీతాల
బత్తి క్రొత్తావి పూగుత్తి సొబగు
వీరభద్రయరెడ్డి విలిచిన మేల్ గీర్తి
వజ్రాల మేడల వలపుఁ దనము

తెలుఁగుఁ దల్లి పసిండి గద్దియల పొంతఁ
బ్రకటి తానంద భావ చంద్రి కలుగాయ
పొంగి పోవుచుఁ ద్యాగ ప్రబోధ మంది
వాసిఁ గాంచిరి రెడ్డి భూపాలమణులు.

విశ్వ మానవ కళ్యాణ వేదులందు
శాశ్వతానందనాక ప్రశాంతిఁ గూర్చి
యాంధ్ర మాతకు నభ్యుదయంబు నింపి
దీప్తిఁ గాంచిన మన రెడ్డి తెగల యందు.

# జననము

పాకనాఁటి రెడ్ల వంగడ మందొప్పు
గట్టమంచి పేరు గలుఁగు నిల్లు
ప్రేమఖని, కొళంద రెడ్డి విభుఁడు మూల
పూరుషుండు నగుచు భువిజనించె.

కట్ట, మంచి దుకూలముల్ గలిఁగి గుములు
గట్ట, మంచి సత్పురుషులు గలిఁగి లెక్క
కట్ట, మంచి శ్రీమంతుల గలిఁగి నాఁడు
కట్ట మంచ్య న్యాయంబది గణుతి గాంచు ?

తేట తెన్గుపదాల తియ్యమామిడిపండ్ల
మకరంద ఝురులలో మసలియాడి
కమ్మకైత నగాసు కలికి వాల్చూపుల
క్రొక్కాఱు తెఱలలోఁ గొలువుదీఱి
ధర్మార్థ మోక్షసాధన సుధారసమున
నుద్దండశక్తుల నూరఁబెట్టి
ప్రకృతివిద్యల సాని భావాల పొదిగింట
నసమాన విజ్ఞాన మభ్యసించి

మచ్చికలు నేర్పు టుయ్యాల మాతృదేవి
రంగరించిపెట్టిన యుగ్గుపొంగుఁ ద్రావి
సాకికొనియెను జగతికి చాలినన్ని
లలితపరోపకారములఁ గొళందరెడ్డి.

ఎందునందమై, నిజమహోమంద కీర్తి
వంది బృందమువోగడ, నేకందు కుందు
సందుకొనిన పేరందు మేలందె సఖుల
డెందములు సందడింపఁ గోళందరెడ్డి.

వెన్నెల గుత్తిలోనగవు వెన్నెల తీవల బేరటాలికిం
బున్నెపుఁ జిన్నెతోఁ బురుడువోసి, ప్రశాంతనితాంతకమ్రపుం
గ్రొన్నెలరాలపై ముదురుకూరిమి యోరిమిఁ గుమ్మరించెడుం
జిన్నమభాగ్యశాలిని మనీషుల మెప్పుననాఁడె బెండిలిన్.

వారినోముల వజ్రాలపంట లనఁగ
ప్రేమ విజ్ఞానమూర్తులౌ పెద్ద రామ
లింగరెడ్డియు, జినరామలింగరెడ్డి
యను కుమారకు లిరువురు జననమైరి.

సరసకవిత్వవైభవ విశారదుఁడై పెదరామలింగ రె
డ్డి రసికవర్యుఁ డాప్తులగడింది ముదంబున గారవించి భా
స్కరశతకంబు, లోనగు జగన్నుతసత్కృతులన్ రచించుచున్
జరితల నెక్కనేర్చెను, ప్రశాంతసమాహిత కీర్తిదీప్తిచే.

నీతుల బుగ్గయై చదువు నిక్కపుబత్తిమిటారు రత్నపుం
బాతరయై, విషాద వనవాటికలశ్రులు జిందువాంద్ర క్రొం
జేతుల బూలతేరులయి; నీచుల కుం జుఱు కత్తికోతయై
పూతయశస్సుతో రసముబాంగెడి తత్కృతికీడు లేదిలన్.

నిర్మలాత్మీయ కీర్తిచంద్రికలగాధఁ
దతపతివ్రతా ధర్మవిద్యాప్రబోధ
నమున గీలించి భక్తిగంధంబు జిమ్మ
చెంగమాంబను బెండిలి జేసికొనియె.

రామలింగారెడ్డి రమణీయ సద్గుణ
శోభితుఁ డార్యసంస్తూయమాను
వీరరాఘవరెడ్డి విశ్వంభరామోద
విశద విఖ్యాతు వివేకచరితుఁ
జిన కోళందయరెడ్డి వినయవిఖ్యాతు స
మంచితాత్మ సమాఖ్యు నలఘుచరితు
సుబ్బరెడ్డి వదాన్య సుశ్లోకుఁడాదిత్య
సమబలుఁడసమాన సన్నుతాత్మ

శక్తియుతుఁడు నారాయణస్వామిరెడ్డి
చంద్రశేఖరరెడ్డి విస్తారవిభవు
లైన నార్గురపుత్రుల యశముతోడ
లీలఁగాంచెను బెదరామలింగరెడ్డి.

అవ్వారిలోన——

ప్రథిత రామలింగారెడ్డి భవ్యమూర్తి
ప్రేమమయుఁ గుమారస్వామిరెడ్డి, కృష్ణ
రెడ్డియను పేర్ల నొప్పారుదొడ్డ సుతులఁ
 గడుపుఁ జల్లగగాంచెను కడుముదాన.

జ్ఞానపునీతనీతులు, ప్రశస్తమహోన్నత సత్యశీల సం
ధాన నిసర్గ భక్తిపరతత్త్వమహత్త్వ రహస్యనిష్ఠ లా
స్థానమునై, సుధాబ్ధియన సన్నుతిగాంచిన జ్ఞానమాంబికన్
మానుఁగ వీరరాఘవుఁ డమంద ముదంబుననా డెఁ బెండిలిన్.

సకలకళా కలాపముల సారముగ్రోలిన జ్ఞానమాంబికా
ప్రకట మహాతపంబు పరిపక్వము నెందు కతాన, వంశ దీ
పకులగు సుబ్బరెడ్డిని, శుభవ్రతనిష్ఠితు రామసామి నిం
కొక సుతు రంగరెడ్డి సుగుణోన్నతుఁగాంచె జనంబు మెచ్చఁగన్.

కదలయి నిల్చిపోయిన వికార కుటుంబ భరప్రవృత్తి చేఁ
గదసిన లేమి వాఁడి కడగన్నుల చూడ్కులకొగ్గి యెంతయే
బెదరక సుబ్బరెడ్డి గుణవీరుఁడు, మంజుల సంస్కృతాంధ్రముల్
గాదకొని నేర్చె,హూణమునుగూడ, మనీషుల మెప్పు పెంపునన్.

మొదలు న్యాయస్థానమున లేఖకోద్యోగి
    యై తొలిమెట్టునం దధివసించి
యవల జిల్లాకోర్టునందు రికార్డు కీ
    పరుగఁ గొన్నేండ్లుగాఁ బనులు నడిపి
నలరేగి కార్పోటినగరు సంస్థాన భాం
    డాగారమున బెత్తనము వహించి
యురవడి నున్నతోద్యోగ లక్ష్మిదేవి
    ముద్దు కేల్గవఁగొంచు ముద్దులాడి

దినదినాభివృద్ధిని గాంచు దివ్యకీర్తి
చంద్రికోల్లాస వీధుల సంచరింప
గొప్ప గొనములఁ బుని కొల్పి కూడివచ్చు
దందడుల నాటు పోటులఁ దమకి తుండె.

వివిధజ్ఞానపుటూట పందిరుల నువ్వెత్తైన భావాల శాంతి వచోలాపన, తీక్ష్ణ దృష్టి రససందీప్తంబు, త్యాగాత్త పాటవ నిష్ఠాతత నభ్యసించి, కడు శ్రేష్ఠంబైన 'లా' వృత్తిపైఁ గవిసెఁ ధీరుఁడు సుబ్బరెడ్డి, కవితా కళ్యాణి మోహింపఁగన్.

వివిధ చిత్తవృత్త్యంశ భూభృత్తులపయిఁ
గన్నిఁడి, మనుష్య చారిత్ర కపు రహస్య
ముల గ్రహించు వారిగువ్వురు; పొలువు నొకఁడు
నాట్యకర్త; రెండవవాఁడు న్యాయవాది.

దీనికొకతట్టు స్వర్గంబు పూని యొప్ప
వేరొకట నరకంబు వేవేగ బొంచు,
రెంటిఁ దులదూఁచి న్యాయసంప్రీణనాది
దృష్టి కిరణాలఁ బ్రసరింప దిటవుకొనియె.

చిత్తరంజనదాసు జిలుఁగు కళోపాస
నా నిష్ఠలందు సంతతము మునిఁగి
రాష్ బిహారీఘోషు ప్రబల పరిశ్రమ
గోష్ఠినీ ఫలముల గుజ్జుఁగ్రోలి

ఆషుతోషు ముఖర్జీ పోషిత విజ్ఞాన
నగరాల గెలుపు జెండాల నెత్తి
జయకరు స్వప్నాల జయ రణభేరుల
మంగళధ్వనులలో మసలియాడి

స్పష్ట యోజన మందు, విస్పష్ట మహిత
వాగ్వివాద పరిజ్ఞాన భాగ్య మందు
తతకుశాగ్ర బుద్ధులను సంధాన పఱచి
యాఱితీరెను లోక కళ్యాణ నిరతి.

పరిమితి యెంతయోఁ గొలత బట్టగజాలని ప్రజ్ఞ రాశిలో
నరుదగు నారు శాస్త్రముల యర్థ గభీరత, భావనా మహ
త్తర మధు నిర్ఝరీక్షణ నిధాన పరంపర కుప్ప తెప్పలై
బరుగిడు విశ్వ మానవుల బర్వీన మాధ్యము విద్ధిఁ జెందగన్.

అసమాన ధైర్య సాహస శక్తి ధీకొల్పు
నిజ యశశ్చంద్రి కల్ నిగ్గులీన
ప్రతిభా ప్రభావ సంభ్రమగాథ రచియించు
మేధావిశేషంబు మెప్పు జెంద
దుర్ఘట త్యాగంపు దుర్గాల గబళించు
దేశోద్ధరణ శక్తి దీప్తిఁ జెంద
ప్రవిమల భక్తి తాత్పర్య నిష్ఠ వెలార్చు
దైవభక్తి మహాత్మ్య తాండవింప.

నవుల మానస మంజూష యందుఁ బొరలు
భావముల రేపి జటిలాంశ పర్వతముల
బొంచుకొని మాత్రలో విదళించి మించి
నడుము బిగగట్టి పోరాడు న్యాయవాది.

కక్షిదారుల వాదన ఖండనమున
సాహసావధిమోహా నాస్త్రముల గురిసి
మంత్ర ముగ్ధుల గావించి మాట మాత్ర!
విజయ భేరుల మ్రోయించు వీరవరుఁడు.

అరయంగాఁ దన జ్ఞానశక్తులను న్యాయస్థాపనార్థంబు, ని
ర్భర సందీపిత సత్యజీవన విహారార్థంబు, స్వాతంత్ర్య ధ
ర్మరమారక్షకు, నుత్తమాశయ నికామత్యాగసంపత్తికిన్
బరమార్థన్ బలిదానముల్ సలుపు సుబ్రహ్మణ్యుఁ డిద్ధారుణిన్.

తన పాత్తిళ్ళగమించు తీక్ష్ణతర మేధాశక్తిలోకాన వా
దన భాగంబుల సత్యసంపద, నితాంతప్రేమ శాంత్యైకభా
వనపీయూష మరంద బిందువుల సంభారంబు జొబ్బిల్లి క్ర
మ్మను విశ్వోన్నతమైన కీర్తి విజయంబుల్ పొంచిముద్దాడగన్.

ఘనమేధావుల నంతశక్తియుతులౌ 'కాలేటు, రాబర్టు' హె
చ్చినవాదంబునన్యాయమూర్తులగుచున్ జిత్తూర్పుర శ్రేష్ఠమం
దున నుద్యోగముసేయఁ దోచని మహాదుర్జేయవాదంబులం
దున నీ ధీరుని సమ్మతింగొనుట యెంతో వాడుకై చెల్లెడిన్.

అద్దియభిమానముగఁ, దదుద్యానసీమఁ
బండు మావిపండులకు 'రాబర్టుపసందు'
కాలెటు పసందనెడి పేర్లఁ గలుఁగుఁజేసి
దిశలఁబూరించె వారిసత్కీర్తి కళల.

కొండొక కక్షిదారునకు గొందలపాటున గల్గినట్టి యు
ద్దండనికృష్ట దుర్మరణదండనకుం బరితాపమొంది యె
న్నం డిటువంటి కేసుల ప్రణాళికజోలికి బోనటంచు బ్ర
హ్మాండపు దీక్షఁబూనెను దయార్ద్రహృదబ్జము బల్లవించుచున్.

వీరి ముఖప్రశోభిత నవీనజగంబును గాంచినంతనే
దీసుపుదీర్పు నేర్పరులు, దివ్యదఖండజయాంకభాగ వి
స్ఫార సుగంధ పుష్పముల జల్లులసేసల గుమ్మరింపఁగాఁ
గోరుదురెట్టి సందియపు గుర్తులుజూపని దివ్యదృష్టితో.

వాలి విధేయులై, తన దివాణపుఁ బుణ్యతలంబు జేసు పా
ర్టీలకు భోజనాల సవరించి, మితంబగు కట్నమంది యు
త్తాలజయాంక కేతన ముద్రగతఁ 'గూరిచి పంపుచుండు బం
తాలకు స్థానమీయని ప్రతాప సుగంధము గుబ్బటిల్లగన్.

కృష్ణ పాళెము దొరగారు కేసుమోపి
సముచితప్రజ్ఞఁ దానే ధనము వ్యయించి
భాగరులతోండిఁ జెండి సాబాలు మేలు
పంపిణీ జేసె నా న్యాయవాదమణికి.

కాలవశాన భౌతిక వికారశరీరము ప్రీలి పాయుత్రై
గాలి దుమారమం దణువు గాఁ బడి మారిన సుబ్బరెడ్డి క
ష్టాల పొలానబండిన యశంపు గొటారుల గొ ల్తఁబట్టి గో
తాలకు గృష్ణపాలియపు ధాముఁడు నింపుచునుండె నేటికిన్.

ప్రాయపు జీవశక్తులకు వ్యగ్రముగాఁ దన హృద్గృహాన జో
టీయక కోర్కుకుంజని, జయేచ్ఛలఁ గప్పురవీడ్యమంది శో
భాయత మూర్తియై విమల భారత భాగవతాది వేదపా
రాయణ రథ్యలం దిరుగు రమ్యవియత్తల పుష్పవీథులన్.

రక్తము వెలార్చి భూరిభారత సముద్ర
మును మథించి, విమలపద్యముల గడించి
యతుల 'భారతసారరత్నావళి' యను
పేర రచియించె గ్రంథ మింపార నొంఘ.

అతని యుదారదానాబ్ధి వీచికలను
యూఁగె సమస్త యాచకాళి
అతని నిస్తుల కటాక్షాపాంగదృష్టుల
యందుఁ జిక్కుకొనిరి యర్థులెల్ల
అతని మహావదాన్యత వర్ణనము జేసి
పరితుష్టిఁగనెఁ గవీశ్వరచయంబు
అతని సచ్ఛీలవియద్గాంగతటముల
హాయిఁ జెందిరి విజ్ఞులాత్మలందు

ఆంధ్రజనముల దివ్యహృదంతరముల
నాయశస్వి ప్రశస్త విఖ్యాతకాంత
పాదుకొని చిరస్థాయిన ప్రజ్వలింపc
దొడcగె దిగ్దేశ విపులసంస్తుతులcగాంచి.

పున్నెముల దొంతి, చెలులcగొంబూలతోట
భక్తి తాత్పర్య నిష్ఠల బాడియావు
ప్రాయపుంగన్నె మిన్న నారాయణాంబ
యనెడి లేమను బెండిలి యాడె మురిసి.

ఆయత పూజలందుచు దయావని గుమ్మరు సుబ్బరెడ్డి, నా
రాయణదేవియందు సుతరత్నములైన నృసింహరెడ్డినిc
ధీయుత రామలింగమహనీయుని, రాఘవకృష్ణ రెడ్లనుం
బాయని కీర్తిశాలియగు భాస్కరరెడ్డిని గాంచె ముద్దుగc.

ఘనతc (శ్రీ)నరసింహరెడ్డి తగు 'నర్కల్లమ్మ' సాధ్వీమణిc
మనసారంగవివాహమాడి, బుధు 'రామస్వామి'సంజంతమాం
బను,బూజ్యాత్ము'ప్రభాకర'ప్రభుని, 'సుబ్రహ్మణ్య'ధీరాత్మునిc
గనెనీ యాంధ్రికి నిత్యపూజ సలుపంగా లోక విఖ్యాతిగc.

తిరుమలదేవి ప్రేమవితతిc విభవాఢ్యుcడు కృష్ణరెడ్డి, సు
స్థిరుcడన వేమరెడ్డిని, సుశీలసుజాత శుభప్రదాంబలc
బెరిమనుగాంచి, దిగ్వలయవీధులc బూవులపల్లకీలలో
దిరిగి ప్రతిష్ఠcగాంచె, ననుదీయ తెలుంగును గారవించుచున్.

సరసాంతః కరణాబ్జ గంధ నిరతిన్, సాహిత్య సామ్రాజ్య ని
ర్భర రత్నాంచిత సింహపీఠికల నారాధించి, కర్పూరపు
న్నిరిపెల్లుబ్బిన నాంధ్ర శస్త్ర పదవీ శ్రీగొన్న వంశంబుగాఁ
దరముల్ గొన్ని గమించిపోయెను నితాంధ్రప్రాభవంబొప్పగన్.

# బాల్యదశ - విద్యాభ్యాసము

సాహితీ పంచు వెన్నెలల చల్లఁ దనంబును బోలి యుండి, న
వ్యోన్మహన పీణతో శ్రుతుల మ్రోసి,మనుష్యజగంబులోన సౌ
ఖ్యావహ లక్షణంబున విహారము సేయును, దాని జీవముల్
సాహస కాంతిపుంజములు సాగు ననంత వసుంధరాస్థలుల్.

ప్రాజ్యము కీర్తి దాయకము, భావర సాత్మకమానఖండ సా
మ్రాజ్యము గుండె నిల్పుకొనిమానుగ బుట్టినవ్యక్తిమాత్రమే,
బూజ్య కవిత్వ తత్త్వముల బుప్పొడి దుమ్ముల జిమ్మరేపి, సా
యుజ్యపథంబుజూడఁగొను, యోజనతంత్రులనిక్వణించుచున్.

సరస సాహిత్య చంద్రికా సాంద్రరుచులు
పీరిహృదయనభమునుండి వెడలి పొంగి
మాన్యతర కౌము దీపత్క మార్దవంపు
బుష్ప కింజల్క వర్షంబుఁ బోలుపుఁ గురియు.

అంతరంగంబునుండి తనంతఁ దాను
కౌముదీస్నిగ్ధధారా ప్రకర్ష కాండ
దీ ప్తులను వెదఁజల్లు సదృశ్యశక్తిఁ
గోరుకొనరాదు, పొమ్మనఁ దీటిపోదు

అహరహముల్ దపించు విబుధాగ్రణి బైఁడికలంబులో సుధా
లహరులుగాని, సౌష్ఠవ విలాసముగాని, ప్రశస్తభావనా
తుహినమరంద బిందువులు దోఁచుటగాని హుళిక్కి, యెన్నియో
యహీతగుణ ప్రకాండముల యబ్ధితరంగము లుప్పతిల్లెడిన్.

సహజసాహిత్య సామర్థ్యసౌమనస్య
ము గల వ్యక్తి కలంబున మొగముఁనుండి
పొలుపుపూవత్తి మెఱుపులబోలు జీవ
నచ్ఛటలు రేఁగి తళ్కొత్తి నాట్యమాడు.

అతని కలమునుండి యానందముప్పొంగు
భావనాశక్తులు బరువులెత్తు
అతని రసనమందు నభ్యుదయంబైన
యున్నతరసనదు లుబ్బటిల్లు
అతని దృక్కులనుండి హర్షప్రదంబగు
శృంగారవర్ణనల్ జిమ్మ రేఁగు
అతని వాక్కులలోన నత్యుత్తమంబైన
సత్యశౌచఋషుల్ సంతరించు

అతని పాదాలచాడల ననుపమాన
దేశ కల్యాణభాగ్యంబు దీప్తిఁజెందు
అతులితాదృష్ట లక్ష్మీగృహంబునందు
బుట్టె రామలింగారెడ్డి బుధవరుండు.

శుభచిహ్నాంబగు పుట్టుమచ్చ కళతో శోభాయమానప్రథన్
ప్రభవంబొప్పుటఁ 'గుప్పనయ్య' బుధుఁడొప్పారఁగ ముత్తాతతో
నిభుఁడంచుం దనపేరు వీరికి మనోంగీకార ధర్మక్రియా
ప్రభతోఁ బెట్టెనురామలింగడనఁగా భావ్యర్థమూహించుచున్.

వయసుతోఁ జెడు నడతలు ప్రాఁకకుండ
క్రొత్త నెత్తావి ననలతోఁ గొండమీఁద
వెలయు మలయజంబు కరణిఁ బెంపుఁ జేయఁ
గొడుకు నభిరుచి జనకుండు గుఱుతెఱింగె.

దీపించు మార్గోప దేశముల్ వర్ణించు
దాంతి దయార్ద్ర గాథల వచించు
పసను కృతజ్ఞతా భాగ్యంబు గుప్పించు
ధర్మసందేశ వేదముల విప్పు
ఆధ్యాత్మ తత్త్వంపు టందల మెక్కించు
వినయ విధేయతల్ విలువఁ దెలుపు
శాస్త్రపరిజ్ఞాన సంస్కారముల నించు
నుపకార చింతన ముగ్గుఁబెట్టు

ప్రేమపాత్రము, కారుణ్య విలసనంబు
సచ్చరిత్రము, మైత్రీప్రశాంతదృష్టి
వేడ్కకులవృద్ధులను గారవించుబత్తి
నాడు నాడుల ప్రవహింప నడుపుచుండె.

తెలుఁగు శకంపుఁ దేరుపయి దీర్చిన లేహావణింపు ము త్తైపుం
జిలుఁగులు, మేలువాసి నగిషీపని రత్నకిరీట హార సం
కలిత ధగద్ధగ ప్రభలఁ గాలము గత్తులబావి తీర్పుతోఁ
దెలిపిన గొండవీటి విషదిగ్ధచరిత్ర వచించు జాలిమై.

పూర్వరాజేంద్రుల పోతరించిన దివ్య
శౌర్యాగ్నినిధులలో శుణికలేరి
ప్రౌఢకావ్యంబుల ప్రతిఫలించి గమించు
నిక్కచ్చి రసములో నిగ్గుఁదీసి
స్వాతంత్ర్యదీక్షల సన్న్యసించిన దొడ్డ
త్యాగిలోకకథాళి ద్రవముదీసి
కమ్మకబ్బంబుల గౌఁగిలించిన క్రొత్త
నాజూకు కళలలో నలకలేరి

'కా'గుణింతంపు బాటలోఁ గళలబోసి
జ్ఞాన విద్యుత్ప్రభాదివ్యనాడులందు
స్థిరపరాక్రమ సంపత్తి దిటవుపడఁగ
బెంచ దొడఁగె దినదినాభివృద్ధిఁజెంద.

రామయ్య లంకలో రామకై పోరిన
గథలన్ని గుమ్మెటఁ గదలరేపి
నాగమ్మ పుంజులో నలిపిపోసిన వీర
పద్యాల తమ్మెట బాఉదీర్చి

పాపయ్యాపగఱతోఁ బ్రతిభక్తై ఢీకొన్న
ఘట్టాల బుఱ్ఱలఁ దట్టిరేపి
సిద్ధోజి కత్తుల శివముతో మార్కొన్న
రసఖండముల గజ్జె రవళిరేపి

పసుపుఁ గుంకుమ జిలికించి పచ్చినీట
పతికి రోసమునూరిన, సతుల వీర
కథల యుద్ధ్రుతి నెత్తుటికండరములఁ
బులకరింపంగ నచ్చుల పోతబోసె.

పదిలముబక్వమై యశము బాలులుదీఱఁగ వాఙ్మయంపుబెఙ్
బదనికలఙ్ గుమారకుని భాసురహృద్గృహసీమఁ బెంప స
మ్మదమునఁ దోటనూలుల సుమాళవృత్తికిఁ జిత్తగించి య
భ్యుదయసుమంపుటక్షతలఁబూజలతండ్రియొసంగెఁబ్రేముడిఙ్.

రెడ్డి హృదంతరాళమున రెక్కొనునారుకు నీటిదేనియఙ్
వడ్డనజేసి పెంచునలవాటు ముహూర్తము ముందుముందునే
యడ్డమువచ్చి కన్నులకు నద్దుకొనెఙ్, శుభమైన మెట్లపై
నిడ్డపదంబు, ఢీకొనజయేందిర లేఁత గులాబి చూడ్కులఙ్.

సరససారస్వత గిరిణస్పర్శనంది
పరమహంసంబునై మేటి ప్రతిభగలిఁగి
నట్టి జనకుని గడుపున నవతరించు
టనిన రెడ్డి యదృష్ట భాగ్యంబుగాదె!

విరసంబై పరమాణువై త్రుటి సుఖోద్వేగంబునై పొంగు పె
న్సిరికై యుబ్బక, భావిభావుక యశశ్శ్రీవ్రజ పీఠంబుపై
గురిసాగించి ప్రఫుల్లచిత్తమున వాకుల్ గొమ్మ సేవాధురం
ధరతన్నిల్పిన ధీరుఁడే చరితలో స్థాపించుఁ గీర్త్యంశముల్.

అతులకవిత్వభావముల కాకరమై తగు భారతంబు స
మ్మతమున దండ్రిపాదయుగ మంగళభూముల నభ్యసించి గ
ణ్యత గుణదీప్తిజాలముల నన్నిఁ గ్రమంబున జింతజేయగా
మతివికసించెఁ, దత్కవులమానుషశక్తుల సానబట్టుచున్.

పురుడువోసిన దెన్గు పురుటింటిగడ్డలో
బరికించిచూచిన ప్రకృతిమహిమ
ముద్దుటుయ్యెలజిల్గు ముత్యాల పందిటఁ
డాళియూకొట్టిన జోలపాట

భాషౌషధులకూర్పు పాకంపుటుగ్గున
బెంచుకొనిన జ్ఞానవితరణంబు
బొటవ్రేలి జుబుకుడు పుట్టతేనియతెట్టె
నేర్పిన యుపదేశ నీతిగాథ

హృదయగోళంబునందు సొంపెచ్చివిరిసి
కమ్మనెత్తావి గమగమల్ గవిసి పొసఁగి
తాండవింపఁగఁజొచ్చె దిగ్దంతిదంత
ముల దదీయచరిత్రలు పూలుబూయ.

పిల్లముటాలతో నగవు పిచ్చినసాలున కొక్కతూరి సొం
పిల్లుచు బందులిందులకు మెట్టి, ముదంబుగ విందులందు బొ
బ్బట్లుల గోళ్ళనంజుడుల ఠీవిగ మస్తుగ నారగించి శో
భిల్లుచు గట్టమంచి తరిబీయతుజేయును నాటపాటలన్.

తతమాధుర్యమరందబిందువుల ప్రాధాన్యంబు జొబ్బిల్లు భా
రతకావ్యాంబుధి వీచికాతతులసంరంభించి వ్యాఖ్యాన మా
యత దీక్షన్ మునిమాపు వేళల సమందానందభావాల సం
హాతితోఁ జేయనుపక్రమించును భయంబావంత బాటింపమిన్.

జ్ఞానవార్ధి 'యమ్మాయమ్మ' సన్నిధాన
మందు ముద్దుకట్టు కతల పొందుసొంపు
వెలకుమించు నూహాపోహ వీరరసము
గ్రోల నభ్యసించెఁ గొనాలకొనలజాచి.

తనర బంధులు తీర్థయాత్రాసుఖాంత
మందు మన రామలింగని కరిదిదోఁప
నొక్క దోవతిచాపు, మఱొక్క రూక
కాన్క లర్పింత్రు వేఱు మకాముసేయ.

ప్రకృతి తనంతఁ దాఁ బరిమళప్రసవైక విశిష్టమూలికా
ప్రకర మహౌషధీ ప్రతతిపాకములన్ గఱగించిపోసి, భౌ
తికగుణశక్తివాహినులదీర్చి, సుధాబ్ధిని జిత్తమందు సా
త్త్వికమునబూంచిపెంచుటకుదీకొనెజ్యోతులరత్నహర్మ్యమున్

కారణజన్ముఁడై సుకవికాంక్షులఁ దీర్చిన తండ్రిప్రేమ క
ర్పూర పటీరహారములఁబొంది, హృదబ్జముజూచి, యాంగ్లభా
షారమ కింకిణీధ్వనుల సల్పెడి *యున్నత పాఠశాలలోఁ
దీరిచి కాలుమోపెను నతి ప్రముదంబున విద్యనేర్వఁగా.

అనవద్య రాజకీయజ్ఞాన శుభభేరి
మ్రోసి స్వాగతమంపె వ్యాసమాని
అఖిల వేదాది విద్యాసార సామ్రాజ్య
భద్రపీఠము నంపె వనజభవుఁడు
తర్కార్థశాస్త్రవితర్క ప్రభాదక్ష
విజయ ధ్వజంబెత్తె వేల్పుటొజ్జ
పంచాక్షరీమంత్ర భద్ర ముద్రాంక కి
రీట మర్పించె వాల్మీకి సుకవి

వరశుభాశీర్వచన పరంపరలతోడ
భూరి కళ్యాణ విమల కర్పూరగంధ
హారతుల దిగ్గజంపు టంబారిపైన
గట్టి వంపిరి యష్ట దిక్పాలవరులు.

మంగళ గీతముల్ ప్రకృతి మార్దవ క్రమ విపంచికా ధ్వనిం
బొంగుచుఁ బంచమశ్రుతుల పొందున బాడిరి దేవతాసతుల్,
నింగిని దీప్తిమై మొఱసె నిర్జరదుందుభు లొక్కతూరి, వా
సింగల బూల వాన గురిసెం విర బూచిన భద్ర దారువుల్.

---

* ఉన్నతపాఠశాల = చిత్తూరు బోర్డు హైస్కూలు.

చివురుంగేలఁ గలంబు ముద్దుఁగొనె, వాసింగన్న భాషా మహా భువనంబుల్ నొలికోడి మేలుకొలుపుల్ ముత్యాలపందిళ్లలో స్తవనీయాంచిత సత్కళాభ్యుదయ సత్ స్తన్యంబువర్షించి మ క్కువ బేరీపుల క్రొత్తచూపు జుజురుం గుప్పించె దీవించుచున్.

కాళిదాసు వలపుఁ గమ్మగై తల చూపు
మొలక పచ్చల కొలారుల బెకల్చి
తిక్కన్న నాజూకు తెనుఁగుఁ దీయ పదాల
ముత్యాల గరిసెల మూత దీసి
శ్రీనాథు వాక్సుధాసింధు వీచీ దివ్య
భావాల కడుముల బ్రద్దలించి
భట్టుాజు ప్రకట శబ్ద శ్లేష దుర్భేద్య
రత్న దుర్గాల తాళముల దెఱచి

క్రుమ్మరించిరి దీవన క్రొత్త మల్లె
పూలపూవారముల గాడుపుల పసందు;
పలుకుల వెలంది తలఁపుల పగడ సాల
నలుగు బెట్టెను గీర్తి కన్యకను సేయ.

జిలుగుందీయ తెలుంగు నాల్కపయిఁ బ్రాసెన్ గమ్మకబ్బంపు బ్రా తల బీజాక్షరవజ్ర శాసనములన్; ధైర్యాద్రి శృంగాల నాం గల భాషాలల నాలలాము నిలిపెన్ గంగా చలత్తుంగ ని ర్మల భంగాంక సమాన భావన శుభార్థప్రాప్తిసంధించుచున్.

తలపంజొప్పడి గుబ్బటిల్లు జ్వలితాంతశ్శక్తి చాంపేయ పుం
గలికల్ రెక్కల్ని కమ్మగాడుపుల మేల్ గాఁగిళ్ళ నాకాశవీ
థుల శృంగార విచిత్రనాట్యముల తంతుల్ జూపి మోదాననా
జ్జల భావోన్నత దృష్టి కావ్యములలో శబ్దించె జ్ఞానప్రభల్.

ఓటమేనాఁడు లేని మహోచ్చదశలఁ
జెలఁగి యున్నతవిద్యల నలరవీడు
కోలునుగడించి, విశ్వవిద్యాలయంపు
ఘన కళావతికళలపై గన్నువైచె.

* త్యాగ ప్రసిద్ధ విద్యాభవ్య దుర్గాల
నాగేశునకు వదాన్యతవచించి
దివ్యతత్త్వార్థ సందీప్త వేదికల రా
ధా కృష్ణునకు మంత్రతతుల నేర్చి
రాజకీయజ్ఞాన రత్నాలపందిట
పట్టాభికభిషేక వరమొసంగి
కమ్మనైతకడాని కప్రంపుసిడముల
రాజశేఖరున కారతులొసంగి

---

* కీ॥ శే॥ శ్రీ దేశోద్ధారక, కాశీనాథ నాగేశ్వరరావు పంతులుగారు, శ్రీ శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుఁడు, హిందూ విశ్వవిద్యాలయోపాధ్యక్షుఁడు, బెనారసు.

శ్రీ శ్రీ డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య పంతులుగారు, బందరు. కవిసార్వభౌమ, మహాకవి మార్తాండేత్యాది బిరుదాంకితులు, పుష్పావతి రాణాప్రతాపసింహచరిత్రేత్యాద్యనేక గ్రంథకర్త శ్రీ దుర్భాక రాజశేఖర శతావధానిగారు, ప్రొద్దుటూరు.

ఘనయశోభూషితుల ముందుగాంచ, నోము
పూలపూజల బచరించి మురియుచున్న
*క్రిస్టియను కళాశాలా సఖీలలామ
జిగురువాల్యాప్రపుటుచ్చులఁ జిక్కుబడియె.

గురువులబోధనా కిరణకోటిసమంచి తదర్శనప్రభా
భరమున శీవినై హృదయపద్మ కవాటమువిప్పి, జ్ఞానపుం
బరిమళగంధవాయువుల, భావయుగంబుల మేలుకొల్పు పం
దిరుల బచారుసేయుటకు నేర్చెను శక్తులు రాజ్యమేలఁగన్.

ఒకటి వచింపవేయుగతులూరు మహోన్నత భావవార్ధిలో,
సకలచరాచరాత్మక విచారణ పోషణదక్షతాప్రభా
ప్రకటమహోజ్జ్వల ప్రవణభవ్యచరిత్రలు శాసనంబులై
నికషముజెంది వ్యాప్తిగాన నేర్చె నిరంకుశధైర్య సంపదన్.

అతులప్రౌఢనితాంత ఘర్షణ సమస్యాచర్చ దుర్భేద్య ప
ర్వత రాజంబులతో నెదుర్కొనుచు, ధౌరంధర్యమేధావివ
క్షిత నారాచ పరంపరల్ గురిసి సాక్షీభూతుఁడై పారక
ప్రతతిన్ మించఁదొడంగె, నన్నిటనుదివ్యజ్ఞాన భాగ్యంబుచే.

చెప్పిన బాల్యభాగముగ్రసించు బిరాన, వినూత్న భావముల్
కుప్పలు తెప్పలై పొరలు కోమలరూపులపొందు నుత్తరం
బప్పనజేయుచుం జదువులయ్యల జ్ఞానకళాసమృద్ధిలో
విప్పెను, ధీరతావిజయభేరుల స్వాగత నిక్వణంబులన్.

---

క్రైస్తవ కళాశాల, మద్రాసు

కడుకొని బాల్యపుస్తక మెగాదిగ నొక్కుటఁబొఱఁజూచినన్
వెడదయెడందఁ బ్రత్యణువువీథుల నచ్చులఁగుద్దినట్లుగా
గడిమి, నిఘంటువై కఱడుగట్టి స్థిరత్వముదాల్చి పూజ్య పు
న్నెడములనెత్తు, మిత్రగణ సేవితుఁడై పొలుపొందు శ్రీవిన్మై.

సరసాంధ్రాంగ్ల రసాత్మకప్రకట భాషామాధురీధుర్య సా
గరముల్ సాంతముఁగ్రోలి, నవ్యకవితాకళ్యాణి మోహించు భా
సురభావంబుల వజ్రతోరణములన్ జోడించి దిగ్జాలముల్
నిరతిన్ వెల్గనఱాబుఁదాపె హృదిలో నిర్వ్యాజమోదంబునన్.

పిల్లవాఁడుగాఁడు పిడుగు తునకయని
వన్నెవాసిఁగాంచెఁ బిన్ననాఁడె;
భావికాలవిజయ పరిణామ మేరీతి
కొనలవిప్పి దిశల గుబ్బటిలునొ ?

జ్ఞానసమంచితార్థ గుణశక్తుల విద్రుమసౌధసీమలో
దాన దయాకలాప పరతత్త్వ మహత్త్వ పరోపకార పా
రీణత దీక్షలన్ దొలకరించి, నిరంకుశ భావదీప్తి సం
ధాన బహూకృతి ప్రవరధామ మొసంగును గూర్మి పెంపునన్.

ఆయతసూక్ష్మబుద్ధి పరమావధి దక్షతఁబూంచి, పాఠ్య ని
ర్ణాయక సర్వవస్తువుల నంతరసైక మరందశీకరా
ప్యాయన భావభాగ పరివర్తన రీతి సమానదృష్టిఁ బా
రాయణఁ జేయుటే? పనికిరాననడే రసహీనకావ్యముల్.

కొండలవంటి కావ్యముల, గుండములంతటి పూర్వభావనో
ద్దండ వినీతిసూత్రముల, తద్దయు మానసికాది భవ్య బ్ర
హ్మాండమతార్థశాస్త్రముల, నన్నిటిసాంతము గ్రోలి మిన్నయై
నిండుసముద్రమై దరులనింపె, రసంబులు పొర్లిపొంగగన్.

మించిన వ్యాసఘట్టమును మ్రింగగజాలిన ప్రశ్నలేరి, ప్ర
శ్నించిన నిద్రలోనయిన చిప్పున నుత్తరముల్ వెలార్చి సూ
చించి ఛలోక్తితోడ వచియించి, పరీక్షకులన్ జయించి మె
ప్పించును మోహనాంగి వలపింపుల బచ్చలరాలరువ్వుచున్.

రెడ్డి గొనాల పోకడ వరించిన గుఱ్ఱలు పెక్కుమంది పెన్
దొడ్డగఁ జెప్పుకోనువిని, ధూర్జటి బోలిన వారలెందరో
యడ్డము వచ్చి రెడ్డి యితఁడౌనె? యటంచు నెఱింగి బందియం
బొడ్డుచునుందు రాతని మహోన్నతితో సరిపోల్చి చూడగన్.

ఊరిసుధాబ్ధులై పొరలు చుండు తలంపుల తేట జాలు ప
న్నీరులలే తొలంకు జిగి నీడల హాయిగ బవ్వళించి, కం
గారు పటాణిపై నడచు కాల మహత్త్వపు రాటపాకుతో
బోరు, నిమేష మేని వృథఁ బుచ్చక నొచ్చక జాగుసేయకే.

ఎయ్యది బోధకు లడిగిన
నయ్యది నేఁ జెప్పెదనని యావేశముతోఁ
దియ్యని మాటల సొంపునఁ
జయ్యన వచియించు మిగుల శ్రద్ధాభక్తిన్.

4)

పుంఖాను పుంఖంబు పొరలి పొంగులు వాఱు
తలఁపు మొగ తొగ నొజ్జలకు బంచు
కట్టలు గట్టలు గవిసి మార్కాను పలు
కు మలారముల డింభకుల కొసంగు
కొండలు గొండలు గుడి కొని కొండాడు
సలహాల దానమర్ధుల కొసంగు
పిడుగులు బిడుగులు బెరిగి ఢీకొని పొంచు
వాక్ప్రమత్కృతి ధాటి పరుల కొసఁగు

సరగ సద్యోవినిర్భిన్న శక్త్య నూన
కోమలోత్పల పాళీ పరిమళంబు
తెనుఁగు భాషా సరస్వతి కొలువు లందు
గుబులు కొనజేయ యత్నించెఁ గొఱఁత నింప.

వాగర్థంబులలో, మరందనిభసద్భావ ప్రవాహంపు టు
ద్వేగాక్రాంతతలోఁ, బ్రమాణములలో, దీపించు
క్రొంజూపు దీ
ప్తా గాంభీర్యములో, నమానుషపు జర్చా భాగధేయంబులో,
దూగేదో యొకనూత్నతత్త్వయుతమాధుర్యంబుప్రాగ్భారమై.

చివరపరీక్షపత్ర పరిశీలనజేయు పరీక్షకోత్తముల్
స్తవమగు రెడ్డి వ్రతమను సంగతినెట్లొ గ్రహించి క్రొత్త పం
డువుగను గండ్లకద్దుకొని నూల్కొని దిద్దక 'మార్కు'లిచ్చి గౌ
రవపరిపక్వసంభ్రమ పరాగము లంపుదు రబ్బురంబుగన్.

తట్టెను గురువుల దృష్టికి,
బెట్టని గోటల విధాన బెరిగెను తలఁపుల్
పట్టిన బంగరు మయమై
ముట్టెను గిరితి పడంతి ముద్దులజిమ్మక.

పూజితంబైన విజ్ఞాన భోగకళల
విప్పి, ఎం. ఏ. పరీక్షదుర్భేద్యసీమ
విజయదుందుభి రవళి శబ్దించి మురిసి
దిశల నూరేఁగఁ దొడఁగె కీర్తినిగ్రసించి.

ఉన్నత భావనానికమణోహల రాజ్యము లేలబంచుఁ గ
న్నన్నల శాంతముం జిలుకు చల్లని చూపుల పువ్వుటీల లా
వన్నల బాష్పపీఠముల బ్రద్దలు జేయను బంచునట్లుఁ దా
మన్ననతోడ జింతనమమర్చును నిచ్చలు జ్ఞానవృద్ధిచే.

అతుల విద్యారణాంగణ మవఘళించి
పొడుచుకొని దూఁకు తలఁపుల పూలమేడ
భరతపుత్రుల నిద్దంపు పౌరుషంబుఁ
దలఁచుకొని పొంగు దేహముల్ బులకరింప.

కొలిపించు నొకనాఁడు కొసరిగోతాలలోఁ
దెనుఁగునాయకుల పావనయశంబు
దులఁదూఁచు నొకనాఁడు దొడ్డమండీలలోఁ
దెలుఁగుజోదుల ఖడ్గముల మహత్తు

పడిగట్టు నొకనాఁడు పరుపుగోటారులఁ
తెలుఁగుగవితలు జిందిన రసంబు
వెలగట్టు నొకనాఁడు వెలుఁగొందు కోట్లలోఁ
దెలుఁగుల తులలేని కలిమిలోతు

సమదశాత్రవభయద నిశాతహేతి
పౌరుషోద్దీప్తులణచిన భరతవీర
వరుల కీర్తిప్రతాప దుర్వారమహిమ
బాడు నొకనాఁడు కావ్యరూపముగ గూర్చి.

తెలుఁగురాజేఁడు గద్దెపయి బరతపిట్ట
శోకించు రచనలో సొమ్మసిల్లి
తంజాపురంపు బాతరలయందుఁ దెనుంగు
ఘోషించు కథలలోఁ గ్రుంగిపోయి
ఓరుగల్ కోటలదూరిన శౌర్యాగ్ని
పులకించుచిన్నెలోఁ బొంగిపోయి
భాస్కరప్రభు దానవాహినీకాంతుల
పుయిలోటు పొగలలోఁ బొగిలిపోయి

భారతీయపురాణ వైభవమహత్త్వఁ
దలఁచి గుండెలుబ్రద్దలై తల్లడించి
కాన్పుడిగి కృశించు దెనుంగు కన్నతల్లి
దుగడ కన్నీటి కెరటాల సెగలబాగులు.

పలనాటి పోతుగడ్డల బెకలించిన
ధీరబాలుని శక్తి దీపకళిక
శ్రీకాకుళపుదిబ్బ సిడముల దులిపిన
నాంధ్రవిష్ణు పరాక్రమాతిశయము
గౌతమీ భంగ సంపాత మొండించిన
చాళుక్యనృపుని ప్రశాంతమహిమ
ఓరుగల్ బురుజుల నోడించి బెరికిన
కాకతీయప్రభుం గంటిమంట

రత్నఖచితంపు సింహదుర్గాల నెక్కి
ఘనతరానంద విజయశంఖంబునూది
తునిఁగిపోవని నిస్తుల దోర్బలాన
సంగిమై పొంగిపాడు నిస్సంగుఁడగుచు.

తన కనుసన్నలో ధారుణీరాజ్య శ్రీ
పాదదక్ష నిష్ణాత కాంతులీను
తన చిఱునవ్వులోఁ దెనుఁగుకై తల నవ్య
శోభాపరంపర శుద్ధిఁజెందు
తన ముద్దుకలములో దాంతి శాంతిదయా స
ముద్రభంగాంకముల్ మొలకలెత్తు
తనలేయెడంద స్వాతంత్ర్యదీక్షా సము
జ్జ్వల పౌరుషజ్వాల సాముజేయు

తన వినూతనవర్చస్సుదాయమందు
'నాత్మవత్సర్వభూతాని' యను ప్రశస్తి
గుదురుకొని దేశమాత వాక్కులఫలించి
దిశల బొడిగింపసాగె సత్కీర్తికళల.

వీరుల పూజారాధన
పారణ దీక్షాప్రభాత భానూజ్జ్వలుఁడై
బోరుచు జేసెను చదువుల
నూరిపిడిఁ దెనుఁగు తల్లి నోములపంటై.

సున్నితమైనభావనల శోభలు పూచిన సన్నజాజి పూ
వెన్నెల గుత్తిలోఁ దెనుఁగు వీరుల పౌరుష కామినీ వయో
భ్యున్నతి పక్వమై, వరుల యోజనకారణ కర్మవీరుఁడై
చెన్ను వహింపఁగాఁ దొడఁగె, శ్రీధునిమించిన బుద్ధిరాశియై.

గోటికిమీసమందుకొను కోడెవయస్సులు తాండవించె, స
య్యాటల నిండు జవ్వనపు టంజలిలో జిగి వాలుచూపుతో
నాటకమాడుచుం బ్రకృతి నవ్వెను, శక్తులు దేశమాత పూఁ
దోటల గమ్మగాడుపులతో వికసించెను సమ్మద ప్రభన్.

అగలినజ్ఞానగంధముల యార్భటిపొందు వరాంగ్లసీమలో
మిగిలిన నాయకోత్తముల మేటియురాల తుపాకిగుండుగాఁ
దగిలిన, యెన్నికోదగు కృతజ్ఞుల పట్టిక యందొకండు గా
గ, గణనకెక్కెఁ, దెన్గునుడికారములో జిగికాంతులీనగన్.

అమరన్ 'ఛార్లెసుఫాక్సు', 'గ్లేడుస్టనువిద్యాసాగరుల్' మెట్టి పూజ్యముగావించి ప్రసక్తితో వెలసి విద్యాకేంద్రమై యొప్పి భావము లూరించెడి కేముబ్రిడ్జిఁ జదువన్ పాశ్చాత్యారారాజద్రవ్యముతోఁ బంపెనుపిల్లుజాబును దయార్ద్రాపాంగదృష్టిప్రభన్.

పొంగెను జాబును గనుఁగొని
యంగునఘీకొను విదేశ యాత్రలు జేయన్
సంగిని తలఁపుల మొలకలు
జెంగున విహరింపఁ దొడఁగె జిలిబిలిసృష్టిన్.

పరమానందము బండ్ల కెత్తుకొని, రూపన్యాస మర్యాదతోఁ
బరివేష్టించిన గీర్తి వైభవరమా పర్యంక శృంగారప్రం
గొలఁతల్ దీటిచిసోలికన్నుమలిపెన్; గొండంత యాత్రాసము
ద్ధరణోద్దేశ్య వితర్కదీక్షలను సంధానించు చారాత్రమున్.

వేకువ కోడి కంఠమున వేఁగుచు జుక్కను నిద్రఁ బుచ్చి పై
దూకెడి కెంపు చాయ జిగితోరపు రంగుల సృష్టి కద్దియుం
ప్రాకట శోభఁగూర్చి, బహు పక్షి నినాద విపంచి కాశ్రుతిన్
మేకొని బొడ్పుఁగొండ పయిమేల్కొనె భానుడఖండదీప్తితో.

పూని యింగ్లాండు సీమకు బైనమయ్యెఁ
దన్నుఁ గడు పారఁ గాంచిన కన్న తల్లి
శిరము మూర్కొని పన్నీరు జిలుకరించి
విమల ధైర్యోక్తిఁ జొనిపి దీవింపఁ దొడగె.

“కొడుకా! ముద్దుల రామలింగ! భువి నీకుంగల్గు మేధస్సుతోఁ
హాడలెత్తించి విదేశ పండితుల జ్ఞానానంద సౌధాలపై
సిడమెత్తించి యశో విలాసజయ నిక్షేపంబు గుంచాలతోఁ
బడి గట్టింపుము! నింపుమా! తెలుఁగుఁబూఁబందిళ్ల కోస్త్రాలలో.

ప్రబల లోకోన్నతాసన వైభవముల
గందపుంగాడ్పు సురటుల కళల దోఁగి
యాయురారోగ్య భాగ్య విహార సీమ
విజయ జీవన దుందుభుల్ విప్పిమ్రోయు.

ప్రకటించెదవు గాక బహు దేశముల కీవు
తెలుఁగు మేధాశక్తి దివ్య దీప్తి
చాటించెదవు గాక సజ్జనంబుల కీవు
తెలుఁగుల తుల లేని కలిమి లోతు
తినిపించెదవుగాక తెనుఁగుజాతులకీవు
పాశ్చాత్య విజ్ఞానభావ రుచుల
వెలిఁగించెదవుగాక తెలుఁగు జెండాపూలు
పరులభాషారమా శిరములందు

భరతపుత్రుల నికరంపు బౌరుషంబు
శ్వేతజాతుల విజ్ఞానశిరములందుఁ
బూజఁగావించి యశము పుష్పాదులగూర్చి
చెలఁగి ముదమారఁ దిరిగివచ్చెదవుగాక.

ప్రమదోద్యానము మించునీయవన సామ్రాజ్యంబు భోగాలయ ప్రముకై వ్యర్థముగా వ్యయింపక, మహాస్వాతంత్ర్యదీక్షారణాంకము బోరాడెడి నీ సహోదరుల ఖడ్గశ్రేణిలో రోష బీజము నాటింపుము, గజ్జెగట్టి వెనుకంజల్ మాని యుగ్రుండవై.

వీరమహాలక్ష్మి విహరించుపౌరుష
ప్రఖ్యాతభూముల ప్రభవ మొంది
శార్చిచ్ఛ్రమంటల గబళించు ధైర్యాద్రి
శృంగసంఘంబుల శిరము మోపి
క్రొక్కాఱు కత్తుల గూపెట్టి కొండాడు
సమరరంగంబున శక్తిఁజాటి
స్వాతంత్ర్యదీక్షా నిధాన ధ్వజోత్తాల
నిర్నిద్ర తేజాన నిష్ఠ నేర్చి

పంచఖండైక లక్ష్మీనివాసమనఁగ
ప్రతిభ నార్జించి తులఁదూఁగు భరతమాత
గర్భముక్తా ఫలంబవై గణనకెక్క
దనరు నీ జన్మ ముత్తమోత్తమము తండ్రి!

గణుతింపఁగారాని కళ్యాణ వేదుల
ప్రతిభావధూటికి శాణ నేర్చి
పుంజీభవించిన భువనరంగంబున
భరత హేతికి తలంబ్రాలఁబోసి

విశ్వోన్నతంబైన విజయదుర్గంబుల
గెలుపు గన్నులతోడ గ్రీడసలిపి
వ్యాకోచ మల్లికా ప్రసవతోరణముల
శాంతిదుందుభులకు సాము నేర్చి

విజయశస్సులతో బూయు నీదుచరిత
మీ యఖండ సామ్రాజ్య విద్యాయతనము
లందు వెలుగియూరేగి నిత్యప్రవర్ధ
మానమై విరాజిలి సొంపులీనుగాత.

మొగలు రాజన్యవర్యుల మొగ్గరమున
యళియరామరాజు విపద్దశార్తిగూలి
సిరికి నెత్తురు కత్తిలోc బిండి, భార
తీయులసిరికి నష్టంబుc దెచ్చి పెట్టె.

అకటా! భారతదేశ పావనమహోద్యత్కీర్తి సౌభాగ్య పు
న్నిశరంబుల్ గడలేని విప్లవదవాగ్నింగూలి దాస్యాంధకా
రకథందూలి, యుగాధకాలగత గర్భంబందునన్ లీనమై
యుcక గన్నీరు స్రవించుచుండె గతియెంతేలేని నిర్భాగ్యతన్.

ప్రళయసింహంబు శివాజీ యఖండ పౌ
రుష ఖడ్గదీప్తి సారూప్యముడిcగి
తెలుcగురాయని వాలు దేవిడీ మొగసాల
రక్తవజసిన వెంట్రుకలు మొలచి

శ్రీ ప్రతాపస్వామి చేసిన స్వాతంత్ర్య
నాటకంబున శౌర్యమేటవ్రాలి
జయచంద్ర నృపతి దేశప్రేమభక్తి దృ
క్కులకళాసంజీవి కొనలుమాడి

చరితదృగ్గోళముల యశ్రుజలముజింది
పచ్చి బంగారుపూవుల పంటనేల
పరుల సామ్రాజ్యలక్ష్మికిఁ బాలికిచ్చి
వగచు భారతక్షోణి విప్లవముచింత.

మూలికాజ్యోతుల మొలిపించు తుహినాద్రి
పెట్టనికోటయై పెరుగుచుండ
ప్రభలీను రతనాలఁ బండించు వారిధి
త్రవ్వని పరిఖయై తనరుచుండ
పుష్కలభాగ్యంబు బూరించు మేరువు
కట్టనిగడియారా చు గ్రాలుచుండ
నిస్తుల శౌర్యంబు నిండించు మేవాడ
రసఖండమై భువిఁ బ్రబలుచుండ

వార్ధి మేఖలభూరి సౌభాగ్యవిధులఁ
గొలువుఁదీఱి మహోన్నత గుణములంది
సింధుగంగానదీ మహాశీర్ష్ని నాద
వరత వర్ధిల్లినది మన భరతమాత.

భారతీయుల విజ్ఞాన భాగ్యవిధులఁ
బంక్తు బులిపించు సాహితీభావరస వి
చారణానుభూతిఁ బరదేశస్థులరిదిఁ
గోరి యాచించినారు ముంగొంగుఁ జాచి.

ఆఱవశతాబ్దినాఁటి యా యాంగ్లసీమ
పోకడల వన్నెచిన్నెలఁ బోల్చిచూడ
భారతములోడ టోలీకి బనికిరాదు
సత్యవిజ్ఞాన సద్ధర్మ శాంతములకు.

సిరులఁ గనిపెంచి తులదూఁగు జీవగఱ్ఱ
ప్రాణగొడ్డము వైరి దుర్గర్వమణప
కల్పవృక్షంబు యాచక కాంక్షఁదీర్ప
ఋషుల గనిపెంచి పెరిగిన మొదటిగడ్డ.

కాలవశంబునన్ మొగలు గత్తులు రేఁగెను, సామరస్య శం
పాలతలన్నియున్ భరతమాతృశిరంబున వాఁడిపోయె, దుః
ఖాలకు దావొసంగి కడగండ్లకులొగ్గి స్వదేశపార్థివుల్
వ్రాలిరి, యాంగ్లతంత్రములవాదరగూలెను దేశభాగ్యముల్.

జననియు, జన్మభూమియును స్వర్గముకన్నను గొప్పబిడ్డ ! పా
వనహృదయంబుతో సహనభావమువిప్పి, మహాభిమాన దీ
క్షను వెలిఁబుచ్చుశక్తులను జాటుట ధర్మము, నీ సమస్తమున్
వినయముతో వ్యయించికొలిపించుమత్యాగమువిక్రమోన్నతిన్

మాతృదేశంబు కడగండ్ల మాడునపుడు
తనదు సర్వస్వమర్పించి తలగకుండ
పోరఁగావలె, వలయుచోఁ బోతరించి
ప్రాణమైనను నర్పింపఁ బూనవలయు.

ప్రతియుగంబున నిజదేశ భక్తిగలుఁగు
పురుషపుంగవుల్ బుట్టుచుఁ బోవుచుంద్రు!
దేశభక్తులు కఱవైన దేశమునకు
కడకు బరికించిచూడ మోక్షంబు లేదు.

పూని నిజమైన దేశాభిమాని తనదు
దేశమనుభవించెడి మహానాశనముల
గూలద్రోయని దేకూటి జోలిబోఁడు!
నిముసమైనను గనుమూసి నిదురబోఁడు.

ఆత్మలాభ పరాయణుఁడైనవాఁడు
తనదు దేశభవిష్యత్తు ధర్మనిరతిఁ
బాడుజేయుచు జీవచ్ఛవంబు నగుచు
బ్రతుకుచుండును కాకంబు పగిదిభువిని.

అతుల దేశాభిమానుల కంతరమున
జాత్యహంకారములుగాని, జాతిభేద
మించుకయొ యుండకయ ప్రసరించుఁ బరుల
పైన పరభాషపైన సమానదృష్టి.

పౌరుషరక్తముంజిలికి భారతవీరుల యుక్కుగుండెలో
నారినజ్ఞానపుం బ్రమిదలందున బోసి జ్వలింపఁజేసి, దీ
ర్ఘారణభేరి మ్రోయుచు దిశాస్థలిమూగిన రెడ్డఖాత్రపుం
గీరితినిల్పుమా! విజయకేతన మెత్తుము తెల్గుకోటలన్.

రాజరాజనరేంద్రు రతనాల మొగసాల
నడుగుబెట్టగ నేర్చినట్టి యబల
మనుమసిద్ధి నృపాలు మాణిక్యనగరాల
ముదమార బెరిగిన ముద్దరాలు
కొండవీడ్పురిరెడ్ల కొలువున గోటీర
పంక్తి నూరేగిన ప్రౌఢ కాంత
కృష్ణరాణ్ణృపుఁ గీర్తి కేతకీ ధ్వజముల
దీప్తిఁగులికిన సాధ్విలలామ

వృద్ధపాషాణమై నేఁడు వెతలజిక్కి
వేఁడినిట్టూర్పు సెగలతో నీడులేని
కలఁతకన్నీటి గుండెడి తెలుఁగుతల్లి
రక్షణము నీ భుజాగ్రపుఁ బ్రాపుఁగోరె.

నీవామెతగట్టుపై నిలువ నూహించిన
పద వీరముల ముందు ప్రస్తుతించి
నీయాత్మ శక్తుల నెక్కొని రాణించు
విజ్ఞాన తేజంబు విస్ఫురించి

బహుళ పరిశ్రమ ప్రస్ఫుట ఘర్మంబు
      వినయ సేవాసక్తి వెడల జిమ్మ
తతతత్పరత మార్గదర్శివాజ్ఞప్తిమై
      ముదమార దర్శనమును గ్రహించి!

తెలుగు కొలువరి తనమున దీప్తిఁ జెందు
నిగ్గుటాణి ముత్యాలు వినీల మణులు
మొలక పచ్చలు, వజ్రాల తళుకులామె
గద్దెఁ జెత్త చెదారంబు గాఁగఁ దోఁచు.

ముద్దులో జిగురాకు మొలిపించు మోహంపు
      గంధర్వ కాంతలు గజ్జెఁ గట్టి
శవములో నమృతంపు శక్తుల సృష్టించు
      వైద్య విద్యా రాణి వాంఛఁ గొలిపి
రాతిలోఁ బూవుల రజముల నుబికించు
      గారడీ మెఱుపులు కన్నుఁ గొట్టి
కుంచెలో నాజూకు గొబ్బిళ్లు నటియించు
      చిత్ర కళానిధీ చిందులాడి

పండి వ్రాలిన జ్ఞానముఁ బలుకరించి
భువన మోహన సౌందర్య ముగ్ధతతిని
యంచితానంద వార్ధిలో ముంచి తేల్చి
విద్యలకు మేటి జమ్మోటి విధము వెలసె.

చిన్నా దేవి పవిత్రకంఠ సుషమాశ్రీమంతమా పుస్తెలోఁ
గన్నీరుల్ వెదఁజిందీ, రాజ్యరమదీక్షుల్ తుంగభద్రానదిన్
భిన్నంబై తుదకస్తమించి మనుహంపీక్షేత్ర కళ్యాణమో
అన్నా! నీదుకలానబూయఁగల భాగ్యంబెప్డు సిద్ధించునో ?

గొజ్జఁగి పన్నీటికొలఁకు కెలంకుల
    కెరటాలలో జలక్రీడ నేర్పి
క్రొంజాయ నగిషీల కులుకు బొమ్మలకూర్పు
    చిత్రాల జలతారు చీరఁగట్టి
క్రొంబువ్వు క్రొత్తావి గురువింద పందిటఁ
    గ్రొంబట్టు ముత్యాల గొడుగుబట్టి
క్రొమ్మించు రతనంపు టిమ్ములు పరదాల
    బూర్ణీసు తేరుల పోషణించి

పూతకాశ్మీర కుంకుమ బొట్టుబెట్టి
యనుఁగు ముద్దు తెలుఁగుతల్లి యమలు, మూఁడు
పూవు లారు పిందెలతోడ గాలి బండ్ల
మీఁద నూరేగునటుల రమింపుమయ్యా.

కానిమఱొక్కమాట కొడుకా! వివరించెద నాలకింపు మెం
తేని తృణీకరింపగ గణింపగ నంటనురాని వారటం
చూచిన పాడుదయ్యమున నూర్జిత విప్లవ వేదనంబుచేఁ
బ్రాణముపీడనున్న మన పంచమజాతులగాంచు మొక్కటన్.

ధనమా! శూన్యము, చిత్తసంస్క్రియల ప్రాధాన్యంబతప్పెబ్బు వే
దనలా! కొండలు, లేమియూకొలవితో దారాడు, దుర్మార్గపుం
బనులా వేడుకనాట్యముల్, చదువులా బ్రహ్మాండకష్టంబులై
యనిశంబా ర్తిని గూలుచుందురు కుమారా! వారుకన్నిటితో.

పంచములు పరులంచును భ్రాంతివలదు;
నీవు దిరుగాడు భువిన జన్మించి, నీదు
బాస మాటాడి, నీ దేశ వాసులగుచు
నిన్ను వెంటాడి ప్రేమించు నిసువులయ్య.

సిరిపెల్లుబ్బిన గర్వదంభముల నిశ్శ్రీకంబుగా నేడు దు
ర్భరమాలిన్యదవాగ్నిలో విడిచి సంరంభించు హిందూ వసుం
ధర భాగ్యోదయ భావిభావుక శుభాంత న్యాసముల్ వారి నె
త్తురు వాల్ పూవులతోటలో మెఱపులై దోగాడుచుండున్ సుతా

కష్టసమస్య చర్చల నగంబులమారొ్కని కత్తిదూసి, వి
స్పష్టపరాక్రమ ప్రభలఁజాటి, వినూతనధర్మతత్త్వపుం
బుష్టిని రేపి, వ్యర్థమగు మూర్ఖవివాదము రిత్తబుచ్చుచుఁ
సృష్టికి జూపువాడె, భళిరే! యుగపూరుషుఁ డిద్ధరాస్థలిన్.

సిరితో స్వర్గము గొల్లబెట్టుకొని పేచీ లేని చాగాన నె
త్తురువర్షించిన క్రీస్తు, దుఃఖజలధిఁ దోరంపుసామ్రాజ్యమున్
గురితో ముంచిన బుద్ధదేవుఁడు, మహాకోటీర భోగాల నా
దరముఁ బాసిన యోగివేమన, పవిత్రంబైన సేవా దురం
ధరతల్ శాశ్వతరూపమొత్తఁదగ లేదా! రామలింగార్భకా!

నినుదర్శించుచు నీదయావిభవమెంతేఁ గీర్తిఁగావించుచున్,
నినుఁ బూజించుచు, నీమహాప్రతిభలన్ నిర్నిద్రతేజంబుతో
వినుతుల్ జేయుచు నీవెలోకమనుచున్ విశ్వాసదీక్షాధృతిన్
మనువారిన్ శరణార్థులఁగరుణనోమఱ జూడుమప్రశాంతమున్

నీసేవయు నీ చాగము
నీ సదమల సహనశక్తి నీదుకళాశ్రీ
నీ సాహసములు భారత
దేశముకొఱకై వ్యయింపు దేజోనిధివై.

అనదలు గన్నీరులార్చుచు జేఁజాచి
దీనతనిన్నుఁ బ్రార్థించునపుడు
పేదలు జఠరాగ్ని వేదనాతప్తులై
చెడుగుల దెలిపి యాచించునపుడు
అధములు గొండంత యానతోఁ గార్యంబు
గలిపించుకొని నిన్నుఁగాంచినపుడు
అర్థులు గొలువున నపరాధ మొనరించి
గొణగి క్షమాపణఁగోరునపుడు

కఱ్ఱతో బెదరింపుముగాని, కడుపుఁ
గాల్చకుము, శిక్షతోదయఁగలుపవలె, మ
హాధికారంబుతోడ న్యాయంబు గలుప
వలయు, నివియుత్తమోత్తమ పథములనుజ.

స్వర్గశాద్వల సీమ జనకుండు మల్లెపూ
జొంపాల దీవనలంపుఁగాత!
భరతభామిని మోదబాష్పాల జగజంపు
గురువింద మణులను గురియుఁగాత!
రెడ్లకీర్తి మ్రింగి ప్రేలు గత్తులబావి
వీరరసంబుఁ ద్రావించుఁగాక!
తులలేని కైతలతోఁటలోఁ దెనుఁగు స
విత్రి చేయెత్తి దీవించుగాత

ఆయురారోగ్య భాగ్యంబు లమరఁగలిఁగి
మెదడు జిలికించి రక్తంబుమీఁదుఁ గట్టి
బహుళవిజ్ఞాన మార్జించి బండ్లకెత్తి
తెచ్చి నాకిచ్చెదవుగాత తిరిగిరమ్ము.

స్తవనీయాంచితమైన నీతులను సంధానించి గంధాక్షతల్
జివురుంబూవులజల్లి, చెంద్రికపుదృష్టిఁ దీసి ముద్దాడి, మ
క్కువతోఁ బూలభిషేకమిచ్చి జయముల్ గొండాడదీవింపగా”
శివమెక్కెఁ హృదయంబులోఁ బొడిచెనిస్సీమప్రభావేశముల్.

జలధుల్ దాఁటుచు దూరసీమకు గళాశాలా మహావిద్య ని
చ్చలునే నేర్వఁగఁబోదు, నీదుచరణాబ్జ ద్వంద్వసందర్శనం
బులు సంసేవలు గొన్నినాళ్లెడముగాఁబోనుంట మన్నించి, యో
దెలుగుందల్లిరో నీ మహాశిషములర్ధింగూర్చి వీక్షింపుమా.

నను నాగ్లేండ్లుగఁ జెంతఁజేర్చుకొనుచున్ నాడెంపుబల్ విద్దెలం
దున విజ్ఞానముగూర్చి, వాదముల నెంతో నేర్పు సంధించుచున్
జనులన్ బేరునునిల్పు క్రైస్తవకళాశాలా మహాలక్ష్మి పు
త్రునిమన్నింపుము, దవ్వునేల పయనంబున్ సైచియమ్మరో.

అనయంబున్ మదుదార మైత్రి నెదలో నాసించినన్ బాయ నొ
ల్లని ప్రేమైకనిధానులౌ హితుల ఖుల్లాసంబు గల్పించుచున్
ననుబోషించిన గొండవీటి గృహమందారంబ యింగ్లాండుకై
చను నాపైన సమస్త శోభనములన్ జాల్వారగాఁ జేయుమీ

నినువీడన్ గలచింత యింతయనుచున్ నేఁబల్కఁగానోప, నై
నను నీ కద్భుఫలింప, నాంగ్లము ననంతప్రజ్ఞమై నేర్చి కీ
ర్తిని సంపాదనజేసి, నీ పదములెంతేఁ గొల్వఁగాక్షించి నా
మనమున్ బూన్చితి, కిన్కఁబూనకుమదిన్ మద్రాస్ పురోత్తం
సమా.

తత సంభాషణవేళ నెంపయిన మద్రాసాంధ్రులన్ మాటశ్రో
త్రతతిన్ సోకిన నైదుఖండములలో దక్షుల్ శిరఃకంప మొం
దితమిన్ మెచ్చఁజరింపఁగావలయునన్ దీవ్రంపుగోర్కెల్ సమం
చితమై కల్గెను, కానఁబోవుదు శుభాశీర్వాదమున్ జేయుమీ,

కడుప్రేమంబున నన్నుఁజూచితిరటుల్ గానన్ ననున్ బాయుమీ
యెడఁదల్ నొచ్చునటం చెఱుంగుదును, కానీ పోవకే తప్ప దీ
యుడు కోర్వందగ, మీరలెల్లగును నెట్లోఁగొంత కాలంబు నా
యెడబాటున్ సయిరింపుఁడీయనుచు నెంతేరక్తి బ్రార్థించెదన్.

అని విజ్ఞాళిని బంధు మిత్రులను ప్రేమాలింగన ప్రక్రియన్
జనవున్ బెంచుచు, మాతృదేవికి నమస్కారంబు లర్పించి దీ
వెనలన్ దోఁగుచు, మిత్రులెల్లగుములై వెంటఁ జరింపంగనొ
ప్పిన యుత్సాహముతోఁ బ్రయాణమును శేసెఁ నిండు
ధైర్యంబునన్.

తన ప్రేమైక మహాభిమానముల పొందన్ గీర్తిజేకొన్న పా
పను తా పెంపుడుచెల్లియైన కమలాంబన్; బుత్రి సంజంతమాం
బను; గన్నీరుల బుజ్జగించి దయతోఁ బాలింతువనం చెంచి శో
భన పుంజావుల నిగ్గుటాణి మణులన్ వర్షించె దీవించుచున్.

పరదేశంబున మాతృభూమిని జపింపన్ దీక్ష లుప్పొంగి మే
టిరహిన్ గడ్డఁ బెకల్చి, చేఁజడుగమట్టిన్ దీసి, పూజించి సం
స్మరణీయాంచితమైన చిత్తమున బూజాపేటికాసీమ సం
బరమున్ దాఁచి స్తుతించి పొంగెను, నమోవాకంబు
లర్పించుచున్.

పుట్టిన గడ్డ వీడి పరభూముల కేగ సహింపలేక తాఁ
బుట్టెడుజాలితోఁ దెనుఁగుభూముల నొక్కటజూచి, దండమున్
బెట్టి, మనః ప్రసూనముల విప్పి, 'కడాపటి' ప్రార్థనంబుతోఁ
గట్టె, ప్రయాణ యాత్రల నఖండ యశస్సుఖి గన్నుఁగొట్టగన్.

తను నెడన్ బాయలేక చింతా వివశత
నొగిలి తను సాగనంపనందు నను జేరు
కోట్ల కొలఁది నెచ్చెలుల వీడ్కోలు తోడ
బాయగా లేక యెక్కె బొంబాయి నౌక.

కులుకు తరంగఫేనముల కూడికతో గిలిగింతలాడి కై
తల జిగిచూడ్కు కావ్యముల తత్త్వములో రసకాంతులీని, న
వ్యాలఁ బొలయించుతుంపురుల పూవులసెజ్జల గ్రీడసల్పుచున్
మెలఁగెడి వార్థి నాయకుని మెప్పునజేరెను సీమదేశమున్.

## విదేశవిద్యావ్యాసంగము

తెలుఁగుదోటలోఁ బూచి క్రొంబలుకు నేర్చి
వలపు దలఁపుల బుష్పాడి వెలకువిలిచి
దిగ్గజంబులబోర విదేశములకు
మొదట బయనించినది రెడ్డిపోటుగాడె!

స్వాదుచరిత్రతో దిశల సారథిఁ బన్నిన కేమ్బ్రిడ్జి వి
ద్యాధనశాంగి కీర్తికుసుమాంజలి మంజులస్వాగతాల మ
ర్యాదలతో నెదుర్కొని, మురబ్బిగ కౌఁగిటఁగ్రుచ్చి తెల్గు వ
స్త్రమును గౌరవించెను హజారపు ముత్తెపు జప్పరంబులన్

ఎక్కెను జదువులగద్దెను
ద్రొక్కెను నాంధ్రికీముదాల పూవులు బూయన్
మక్కువ జ్ఞానపు గొండల
గ్రక్కున వికసించె, మిత్రగణములు మెచ్చన్.

అరయ గౌటిల్యుని యర్థశాస్త్రాంభోధి
తరళ వీచీరాశిఁ దఱచితఱచి
అతుల యుగంధరకృతి న్యాయశాస్త్రంపు
టుక్కు పుష్పాడికొండ లురలఁజేసి

నిరుపమవీరబల్ నీతిమహత్త్వ వి
స్తారవేదులను సంచారమూని
మంత్రి తిమ్మరుసు సమగ్రరాజ్యరహస్య
తత్త్వసూత్రంబుల తవ్వుడుజేసి

భీతి రవ్వంతలేని గంభీరపరత
కేంబ్రిడ్జికాలేజి సఖిలలామ
తన్మయత్వాన బిండీకృతంబుగాగ
ప్రతిభ వికసించి విహరింప ప్రభవహించె.

ఒకసారి కీట్సుభావోద్రేక కౌముదీ
స్నాతరమ్యారామ సరసీమురియు
ఒకసారి షెల్లీమహోన్నత కవితావి
పంచికాశ్రుతుల కబ్బము వహించు
ఒకట షేక్సుపియరు ప్రకటకవిత్వ వి
ద్యుద్దీప భువనాల తూర్యమూదు
ఒకట వర్డ్స్వర్తుపదోజ్జ్వల నందనో
ద్యాన కల్పకసీమ లందుసోలు

అబ్బురముసెందు నొకతూరి యంతులేని
మిల్టను కవిత్వ నిర్ఝరీమిళిత మాధు
రీధురి సముజ్జ్వలప్రభా ప్రీణనమున
దనివిఁదీఱని సంతోషమున మునింగి.

అడిగిన నెట్టిప్రశ్నములకైన జవాబుల దూరదృష్టితో
నుడువుచు, సద్గుహూర్తము లనూనబలంబుల దుమ్ముధూళిగా
గడచనజేయుచుం, బరులు గాదనుదానికి జీవవాయువుల్
బుసిసిటఁబోసి, యౌనని నిరూపణజేయుఁ బ్రభాధురీణతన్.

అతని నిశాత హాస్యరస సమృద్ధిలోఁ
బడియుబ్బి నవ్వనివారు లేరు
అతని యుపన్యాస గతిచమత్కృతి సుధా
వార్ధి దోఁగాడనివారు లేరు
అతని జిల్గుతలంపు టద్దాలమేడల
ప్రభలకు బొంగనివారు లేరు
అతని మహారచనానంద భువనాల
వలపుతోఁ దిరుగనివారు లేరు

అతని సచ్ఛీలగాంగ సైకతములందు
వెడలు గంభీరభావనావేశరతిఁ బ్ర
మాణముగ జేకొనని సుధీమణులు లేరు?
నచటి గేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమున.

ఆంగ్లభాషలోఁ దెలియని యరిదియరిది
ప్రశ్న లాంగ్లేయులెపుడు గర్వంబు వీడి
తెలుఁగుమునగాని సౌధంపుదలుపు జెంత
నేర్చుకొందురు శంకలుం ద్రెంచుకొంద్రు.

ఒకనాఁడు తరగతినొజ్జ పాఠంబును
        తేటగాబోధించి తెలుపుచుండ
తక్కవిద్యార్థులు మక్కువతత్పాఠ
        ముసు వ్రాయుచుండిరి వినిముదాన

రెడ్డివ్రాయక, సి. ఆర్. రెడ్డి సీ. ఆర్. రెడ్డి
        యనుచు నోట్సువయి వ్రాయఁగ దొరకొన
ఆయుపాధ్యాయుఁ డయ్యదిబుద్ధి గ్రహియించి
        చదువు నోట్సనుచు నాజ్ఞప్తిఁజేయ,

మొదటనుండి చివరిదాక వెదకుకొనక
నీళ్ళుద్రావిన చందాననిలిచి యొక్క
పొల్లుపోకుండ వల్లించె. బుధుఁడు బాలు
రంద రాశ్చర్య మగ్నులై యట్టెచూడ.

గురుగణంబులం తేవాసి కోవిదాళి
రామలింగని బుద్ధి సంరంభ మహిమ
వర్ణనము సేయగా లేక భ్రమలు దప్పి
త్రుళ్ళి తూఁగుచు నుంద్రు సంతోష పరత,

హృదయ శాణంపుటంచుల బదను నెఱపి
మానసిక, నీతి శాస్త్ర సమగ్ర భద్ర
ముద్ర వజ్రాల ఖనులు ప్రభూత కాంతు
లీనజికిలి గావించె ననూన దృష్టి,

మాటల యందును జూపుల
గోటల యందును, ప్రశాంత గుణముల యందున్
ఆటల పాటల యందును
నీటగు జ్ఞానంబు లుబికి నిండగ జొచ్చెన్.

భోగ సమాహిత ప్రభల బొందిక నొల్లని జ్ఞాన రాశిలో
త్యాగ సమృద్ధితో వరలు తావిడి లేని ప్రశస్త కీర్తి యూ
రేగనినాఁడు, పూలు ధరియింపనినాఁడులు, స్తోత్రమాల పూ
జాగతి లేని నాఁడుఁ గనఁజాలము నాఁటికి నేఁటి కన్నిటన్.

స్థిర సంకల్పముతోడఁజేరుకొనుచున్ సెంట్ జాన్సు కాలేజిలో
గర మొప్పారగ తర్కశాస్త్రమును, నింకన్ నీతిశాస్త్రంబు, న
బ్బురమారన్ విషయంబుగాఁ గొని జనంబుల్ మెచ్చ
ఛాత్రాళియం
దరలోసన్ ప్రబధముండునాఁబడెనుదాత్త స్తోత్రపాత్రుండునై.

ఆలో సెంట్ జాను కళా
శాలను విద్యార్థి సమితి సంస్థాపనమై
క్రాలెను, నానా విషయము
లోలిన్ జర్చించుచుందు రుల్లాసమునన్.

సమతల్ లేని మనోవికాసము రహించన్ నాఁటివిద్యార్థి సం
ఘమునన్ బేర్గొనికార్యదర్శియయి సంఘుంబందువాదించు ప్రా
జ్ఞమనీషుల్ పదివేలచందముల ప్రస్తావించి కీర్తింప కా
ర్యములన్దీర్పఁగసాగెనాంధ్రులయశోవ్యాప్తుల్ నభం
బంటగన్.

పదపడి నధ్యక్షపదవికి నెన్నిక
లరుదెంచె నపుడు విద్యార్థి సమితి
నుండి యధ్యక్షుఁ డొక్కండు రాఁదగియుండె,
నద్దాని కీతడభ్యర్థియయ్యె
కత్తిపైనను సాముకరణి నాపోటియం
తంతకుఁగడు సున్నితముగ రేఁగ
సెంట్ జాన్సు కాలేజిచిన్నది, నాల్గువం
దలబాలురుండిరి, దానియవల

నాలుగువందల బాలకు లలఘు నొండు
పాఠశాల విద్యార్థి యభ్యర్థియయ్యె;
బహుళసంఖ్యా బలంబున వాఁడు నెగ్గె
మనకు నిసుమంత తక్కువై పనియుఁ జేసియె.

తెలుఁగు పోటరి నిస్తుల తేజమునకు
పొంగిపోయిన కొందఱు పోతరించి
దానికటు సహింపక యుపాధ్యక్షపదవి
యందు నిల్పిరి వాదంబులందునిగిడి.

ఎక్కడి భారతీయునకో ? యీబదవీ మణిమాల మేడలో
మ్రొక్కుల గౌరవంబిడుట పూజ్యముగాదని ట్రిటిపోటితో
పిక్కటి సమ్మెఁజేసి పదవీ మహదర్థము రిత్తఁ జేయఁదా
మిక్కిలి యత్నముల్ సలిపి మిన్నక యుండిరి చెల్లకుండుటన్.

పదియుఁ దొమ్మిదివందలప్పైన యాఱు
వత్సరంబున గావింపఁబడుచు మొగ్గి
నెగడు సాధారణంపు టెన్నికలయందు
ధారణాశక్తి సంధించి దవుడుబట్టె.

రామునిదూత సీతకయి రావణుతో నడిబొడ్డులంకలో
దీమసమూని రక్కసులదీకొని పోరి జయించినట్లుగా
రామయలింగరెడ్డి గుణరాసులతూపులు గాలివానతో
సీమనుబీల్చి పిప్పిగనుచేయుచునూపెను మూఁడెయూపులన్.

మోదుజిగుర్చు నాతని ప్రమోదవచో విభవప్రసంగ పు
న్నీడల జాఁబువాఱి పయనించెడి భావసుధాతరంగ పుం
జాడల మాధురీరస విచారపరంపర గ్రోలిగ్రోలి కొం
డాడి యశోవిలాస విజయంబుల బాడిరి హూణసత్కవుల్.

అతుల ప్రసంగవేదిక మహాసనమెక్కి నిశాతదృష్టి సం
స్తుతమతిరేపి, నిబ్బరముతోఁ బరమాణువులందు జీవమా
రుతములపోసి, కొండగ నిరూపణ జేసి యుపన్యసించు సా
మ్మ్రతని స్వాభావసిద్ధమగు నభ్యుదయంబులు జన్మభాగ్యముల్.

భవ్యరససుధా బ్రహ్మాండ భాండములను
కలములోఁజెక్కి పోసి నక్షత్రమాల
లట్లు జిలుఁగుభావజ్యోతులందు నిలిపి
దీటిచిన పరీక్షాపత్ర ధీ ప్రశంస
శాశ్వతస్థానమంది ప్రశాంత కేము
బ్రిడ్జిఁ దనరుచుండెను నేఁడు రేపులనక.

WELNEY RECTORY
Wisbech,
LONDON
2-1-46.

*Dear Mr. Joseph.*

Your letter of Dec. 8th came a day or two ago. I cannot give you much information. I am afraid. Mr. C. R. Reddi came to Cambridge. I think, in 1902 and read Mental and Moral Science at St. John's College. He was a prominent speaker at the Union of which he became secretary in 1905, I believe. There was an exciting election for President, but he was beaten by a Trinity man — Trinity had about 600 men to St. John's 400.

He took an active part in the 1906 General Election on the liberal side after that I did not see him until I went to Masulipatam in 1921.

A year or two back I sent Sir C. R. Reddi as a Christmas Card, a book which I came across in Cambridge about the union of his day: it was secondhand, but would recall to him many memories of old debates. If you get hold of that book from him it will give you glimpses of his Cambridge Career in which he 'incidentally' read for the Mental and Moral Science tripos. I mentioned that once at Vizagapatam, and he was greatly amused at the word 'incidentally' which he said was quite accurate. All good wishes for your book and to the Vice - chancellor from this Country Rectory.

*Yours sincerely,*

A. B. Johnston.

జంటితేనెలు జొబ్బిల్లు జూపులందుఁ
గారణంబులు బొడగట్టు తీరులందు
పలుకులందున గ్రొమ్ముద్దు కలమునందు
తలఁపులందున గొండంత విలువఁజూపె.

సడువులేని పదాల చందమామ పదాఱు
    కళల పింజెలను వాములబిగించి
తీయఁదలంపుల తేటకైత రసాలఁ
    వెలుఁగుఁ గలాలమూతులకు ద్రాపి
ప్రాశ్చాత్య విజ్ఞానవాహినీ దీప్తుల
    వెడఁదజగంబున విస్ఫురించి
అతులిత రాజకీయ రహస్య తంత్రాల
    కోటల మెదడున గూర్పుఁజేసి

కవియునై, పండితుండునై, పవిసమాన
ధైర్య తేజోనిధియునై, యవార్యధర్మ
యోజనా ధురీణుండునై, జ్యోతులందు
జ్యోతియై మాతృభూమిని జూడవచ్చె.



# భాషా సేవ

## కృతులు - విమర్శలు

తెలుఁగు బాసకు గ్రొత్త రూపుల నమర్చు
నాయకులు నేఁడు వలసి యున్నారు మనకు!
అట్టి విబుధుఁ డాంధ్రాంగ్లములందు గొప్ప
ఘనత నొందిన రెడ్డి యొక్కఁడె నిజంబు.

భాషా మహా సుధా వారాశిఁ దెగఁద్రావి
        శక్తి నింపినగుంభ సంభవుండు
ఆంధ్రాంగ్ల భాషల సరికట్టి సవ్యాప
        సవ్యాల గుంఫించు సవ్యసాచి
పర భాష లెన్నేని వలచిన నిజ భాషఁ
        గలనైన మఱువని దెలుఁగు బిడ్డ
మాతృభాషా క్షేమ మహిమ కై వ్రతనిష్ఠ
        బాసి యెఱుఁగని గంగా సుతుండు.

తీవ్ర పరితాపభరము సంధించుచున్న
నడగడుగునను, కులికితీపారు వక
రాక్షరమునఁ దెన్నుఁ దనము లార్చి యార్చి
ప్రేమఁ బ్రవహించి విహరించు వేద మూర్తి.

వేమన యోగికావ్యరస వీధులలో శయనించి, దివ్య భా
షామృత పూర్ణమై తొణకులాడెడి తిక్కన నిగ్గుకైతపుం
గోమల శైలిశర్కరల గూర్పుల బొక్కుచు, సూరనార్యుతో
సాములుజేసి నవ్వుకొను, సారకవిత్వ విశాల వేదులన్.

తన ప్రాగ్జన్మ తపఃప్రభాతకళలంత శ్శక్త్యజాండంపుఁ గ్రొ
న్ననలర్ విప్పెను, జ్ఞానగంధముల విన్యాసంబు గుప్పించు వా
సన లేతెంచె, ననంతనవ్య కవితాసామ్రాజ్య సింహాసనం
బును బూజించెఁ గలంబులోఁ గులుకుసొంపుం దేజ
మర్పించుచున్.

పున్నాగంబులు ముగ్గులుంచినవిపూవుల్ రాల్చినన్ గైతగ్రొం
బన్నీటన్ జలకంబులాడి; సితశోభాభావ హేమంతపుం
గన్నెల్ బూచిన సన్నజాజుల రజఃకళ్యాణచిత్రాలతో
వన్నెల్ దిద్దగ నేర్చుకొన్నయవి సౌభాగ్యంబులుప్పొంగగన్.

ఆలాపించిన మాధురీరచనలం దాంధ్రాభిమానప్రభల్
జాలై పాఱి తడింపఁజేసినది భాషాస్వర్ణ కేదారమున్;
వాలాయంపు గలంబులోన బొడిచెన్ ప్రాభాతలక్ష్మీ మహో
లాలిత్యంబులు దెల్గువాటికల వాల్లభ్యంబు లొప్పారగన్.

నెఱిసంజజాహ్నవి కెరటాలగౌఁగిళ్ళ
మురిసియుట్టిపడు దెమ్మెరలతోడ
పొరల విప్పార్చి పుప్పొడి దుమారంబులఁ
దులఁదూఁగు తమ్మినెచ్చెలులతోడ
పండు వెన్నెల నిగ్గు పరువంపుగలిమిన
గులికించుమల్లెల వలపుదోడ
జిగురాకుటాముని జిలుగారుచీరల
మలయు క్రొమ్మావి క్రొంబట్టుతోడ

పొక్కిపోవుచు నిక్కుచు మురిసికొనుచు
పలుకుపూఁబోడి వలిపంపు బొన్నుపైన
నిష్కళంకంపు టసము గిన్నెరులమీటి
పాడుచున్నది వలపూరు బాటగముల.

కమ్మఁదనాలతో జగముఁగ్రమ్మిన పమ్మిన కైతచానయం
దమ్ముల బెండ్లిపందిరులఁ దార్కొని బుప్పొడిజిందువాఱు పూ
దెమ్మెర నారతిన్ దెనుఁగుదేవి సుఖంబుల గద్దెపైన మో
దమ్ముఁజిగిర్చె నిస్తులిత దర్శనభాగ్యపు వ్రజకాంతులన్.

చలువల్ జిమ్మెడి పూలపందిరుల పజ్జన్ లేఁతగేదంగి తా
వుల గ్రొంజల్లులతోటలందు గమకంబున్ జూపి పొంగారుచున్
వలపుంజిమ్మెడు తత్కవిత్వమహిమ ప్రాగ్భారమెంతో రస
జ్ఞుల మేల్కొల్పె విచిత్రపుం గలమునాజూకేమి చిత్రించెనో?

ఒక్కొక్కఘట్టాన నుక్కుపుప్పొడిరాల్చి
భరతపుత్రుల బ్రభఁ బలుకరించి
ఒక్కొక్క రచనమం దుజ్జాతలూపును
తెలుఁగుజోదులకత్తి తెగువ రేపి
ఒక్కొక్క పాత్రకు యుసిఁబోసి యాడించు
మరుగైన చరితల బరువుదూచి
ఒక్కొక్క ఖండమం దుద్రేకములబూంచు
కదలిపోయిన తెల్గుకతల బాడి

ఒకొక్కకట దేశచారిత్రకోద్యమముల
కొలకు కత్తికలంబును గొసరి లేపి
నట్టు బడకుండ చకచక నడుపుచుండు
నిశితమైన జ్ఞానంబుఁ బుంజీభవించి.

తిక్కన్న కలములోఁ దెరలి పొంగులువాఱి
నలపూరుజంటి తేనెలవసందు
శ్రీనాథకవి కళాసిద్ధిలో వాసించు
పాలిపోని కమ్మఁ బుప్పొడులజల్లు
పెద్దన్నకైతలో ముద్దుల వెదఁజిందు
మృదులకర్పూరంపు మొత్తఁదనము
భట్రాజువాక్కులోఁ బ్రభలీని శబ్దించు
వ్యంగ్యవీచీ ధ్వనులందగింపు

తనకలంబున లేకత్తి తాండవించి
శబ్దసంస్కృతి, భవ్యరసప్రయుక్తి
యర్థసంపుష్టి హృద్యభావానురక్తి
ప్రతిఫలించెను పుంభావ వాణిగాగ.

వెన్నెలముగ్గుగాఁ దెనుఁగు వీథుల గంటలగొట్టి లేపి యు
ద్యన్నత మంగళప్రదవిభూతి పరంపర తొల్కరించుచున్
తిన్నఁదనాలతో మధుర దీప్తుల గీతికలాల పించుచున్
మన్ననఁబొందెఁ దత్కృతుల మానుషమై జిగిముద్దులీనగన్.

బూదినిచేఁబూని బుప్పొడిగొండగ
దవిలిమార్చిన కాళిదాసు కలము
దుమ్ముదోసిటఁబట్టి దులదూఁచి బంగారు
చెరిగి తేలిచిన షేక్స్పియరు ప్రతిభ
చెత్తను మంత్రించి జిలుఁగు మెఱుంగు లం
కించు సృష్టినిజూపు కీట్సు దృష్టి
కఠినంపు గుండెలోఁ గారుణ్య మొలుకు వి
లాసంబు గూర్చు మిల్టను మహత్తు

వర మహోద్భుత హాస్యసంపదలనించి
యెండుమ్రాకుల పాత్రిళ్ళ నిగురుటాకు
జొంపముల, బూతపిందెల సొంపునింపు
రెడ్డిమహిమ లెంతేని వర్ణింపనగునె ?

రచనాశిల్పము, స్నిగ్ధభావసుకుమారత్వంబు, భాషా ప్రభు
త్వచమత్కారము, కల్పనాచతురతా దక్షత్వసౌభాగ్యపుం
ప్రచురత్వంబులనంతమై మెఱుపులై బ్రహ్మాండపూజ్యంబులై
రుచులం దేల్చుచుబొంగుతత్కృతులసారూప్యంబుసామాన్యమే.

గగనకల్లోలినీ కల్లోలముల దూఁగు
దేవతాసతులతోఁ దిరుగునొకట
వాసంతికానందవాసరంబున బాడు
పికకంఠ వీణతో వెలయునొకట

తెమ్మెరతంత్రుల సుమ్మెటనూరేగు
భావనాజ్యోతులబట్టు నొకట
సుఖదుఃఖముల దాడుజూచి సంతోషించు
ప్రకృతిచేష్టకుదిరి పడు నొకంట

ధీరుఁడై రసికుంజుఁడై మేరువునయి
త్యాగియై, పండితుండునై యధిపుడునయి
భోగియై కవిశ్రేష్ఠుఁడై భువి నొకంటఁ
జెలఁగి శూన్యతలోఁబుష్ప సృష్టిఁజూపు.

వెన్నెలలబోలు కీట్సు ప్రసన్నభావ
శైలి గోస్తనీ రసవనీ శాద్వలముల
దేశాలోలికెడి కైతఁ జిత్రించుకొనుచు
పూలరంగఁడై ప్రకృతితో మురిసికొనును.

మహితమిల్టను, షెల్లి, యెడ్మండుబర్కు స
రోజినీ రవీంద్రుల వాణిలో గమించు
గద్యరచనా మహోద్భూత కౌశలంబుఁ
దనకలానఁ గులికి కవితామహత్త్వ
మునకు నిక్షేపమై, తేనెపొందుఁ గూర్చి;
శక్తిఁజాటు ప్రపంచ రచయితలం దొ
కండు నగుచు, ఛందోబద్ధ కాంక్షలేని
యమలకవితా సుధాభాండ మనువదించె.

అక్కరముల నాంధ్రాంగ్లములందు భేద
ముండు, శైలి భేదము లేక యుట్టి పడును,
ఒకటి నేర్చి రెండవ దాని నూటఁ గలుపు
తెలుఁగులను రాచ బాటల ద్రిప్పినాఁడు.

చిన్నయసూరి గద్యగత శిల్పముతో హృదయంపు దంత్రులన్
గ్రన్నన మీటి, హూణ కవిరాజుల పేశల భావసంపు వా
ల్గన్నుల సైగ చూపుల మలారము సొంపుకు సొమ్ము సిల్లి తి
క్కన్నకు మీదుగట్టె నుడికారములోఁ గల భక్తి సంపదన్

తెలుఁగు సొబగుల జూపు జాతీయములను
సృష్టిఁ గావించి రచన ముద్రించె నేని
యలను నక్షత్ర ఖచిత వియత్తలంబు
పగిది భాసిల్లు సాహితీ పద్మనయన.

తెలుఁగుం దల్లికి వన్నె చిన్నెల కళోత్తేజంబు సంధించి పు
వ్వులగుత్తిన్ సిగఁబూచి, కప్పురపుదుమ్ముల్ గ్రొత్త జల్తారు గా
జుల, హారిద్రపు సొంపు సంపదలతో జోకొట్టి, నవ్యంపుఁ గూ
ర్పుల గబ్బంబెదఁజల్లె, సత్కవి కుమారుల్ దన్ను శ్లాఘింపగన్

లలిత మగు నీతని గలమున
గులికెడి గ్రొంగ్రొత్త పువుల గ్రొత్తావి హారం
గుల చవిగని, నూతన కవి
తల నేర్చిరి కొంద రద్భుతంబచ్చు పడన్.

అంతియే గాని యాధుని కాంధ్ర కవిత
కన్న బిడ్డల వజ్రాల కాన్పులకును
కారణము మేము మేమని గర్వ పడుచు
విఱ్ఱ వీఁగుట చెల్లని వింత తలఁపు.

అతని ప్రయోగజాలముల యర్థగభీరత. సౌమ్యశబ్ద సంతతుల గ్రహించి మెచ్చుకొని నవ్యకవీంద్రులు దివ్యదృష్టిఁ దత్కృతుల బ్రసూనవేదికల దీఱిన జ్ఞానపుటాటపందిటన్ వితత కుతూహలప్రభల వీగుచునుండి రనంతదీక్షతో.

అతులితాంధ్రాంగ్ల భాషామహార్ణవముల
జిలికి మీగడతరకల జిడ్డుదీసి
'యుద్ధశాస్త్రంబు' మఱి ముసలమ్మమరణ'
ములు రచించెఁ దెనుఁగుఁదల్లి ముద్దులాడ.

సమతప్రజ్ఞ వెలార్చి నవ్యకవితాసామ్రాజ్య శృంగారపుం బొమ నాజూకుల దిద్దిదీఱిచి, కళాపూర్ణోదయ గ్రంథ రాజముపై వ్రాసె విమర్శనాపరీక్షణ చర్చాభోగ దక్షత్వ పాకము లచ్చుంబడ, దానితుల్యముగ నే గ్రంథంబు లేదిద్ధరన్.

దీఱిచి 'కవిత్వతత్త్వ విచారమం'చు
బేసు గలిపించి, సాహితీ వీథులందుఁ
బలుకుఁ బూబోఁడిఁ బచ్చలబల్లకీల
నాటలాడించుచుండెఁ దా ననుదినంబు.

కాళిదాసును మీఱు గండరగండడు
చెళ్ళపిళ్ళాన్వయ క్షీరవార్ధి
విధుమూర్తియైన యా వేంకటశాస్త్రి స
త్కవిలోకగురుఁడట్టి ఘనమనీషి
నాంధ్రదేశంబెకా దఖిలభారత దేశ
మెఱుఁగఁదంచని గీర్తి వరలినాఁడు
నావిజ్ఞునకు వేరు కోవిదునకు మాట
పట్టింపుగలిఁగిన పట్టునందు

తత్కవిద్వయ కావ్యసంతతుల దెచ్చి
తఱచి తమతమ భావవిస్ఫురణ దేల్చి
ప్రేమఁ బ్రార్థించి రిరువురీ రెడ్డిగారి
ననిన, రామలింగారెడ్డి ఘనత దెలియు.

సకలాంధ్రావని పండితోత్తములు దోషజ్ఞ ప్రభుండంచు, న
చ్చ కవుల్ సత్కవిశేఖరుండనుచు, భాషల్ దీర్చు నాయావిమ
ర్శకలోకంబు విమర్శకోత్తముఁడనన్ సత్కీర్తిఁ బ్రాపించి వ
న్నెకు నెక్కెన్ మనకట్టమంచికులుఁడున్ నిర్నిద్ర తేజంబునన్.

ఒకమాఱు వివిధపుష్పోజ్జ్వల ప్రభలొప్పు
నందనోద్యాన సౌందర్యమహిమ
ఒకపరి చంద్రికాపత్రికట రాత్రుల నదీ
నౌకాప్రయాణ సంతతసుఖంబు

ఒకనారి నవముదభ్యుదయ మానస సరః
ప్రవరవిహార సౌభాగ్యగరిమ
మొకతూరి కనకరత్న కళాభిశోభిత
ఘనసౌధ రాజదర్శన ముదంబు

కవికకీర్తి సి ఆర్ రెడ్డిగారి కావ్య
ముల జదువునప్డు, కరతలామలక మనుట
చంద్రుఁడు ప్రసన్నతాగుణ సాంద్రుఁడనుట
సరసిజాప్తుండు మిగుల తేజస్వియనుటె.

ఇతని సుకళాపిపాసకు నీడు లేదు
ప్రకృతి సౌందర్యపరత, యప్రతిమమగును,
యుం రసగ్రహణ నిరూఢియనుపమంబు
తన్మయత్వ ప్రశస్తి విద్వత్ప్రతంబు.

చక్కని భారతార్థముల సారును, తిక్కన చిత్తవృత్తియుఁ
దక్కను భావనైపుణియు, నేర్చిన ధీరులజూపుమన్న చో
నొక్కఁడు కట్టమంచికులుఁ డొక్కఁడు చెళ్ళపిళాన్వయుండు గా
కిక్కడ వేరొకం గనంగలరే ? పెరవారి మదాంధ్రసీమలో.

# పుట్టుమచ్చ

ననుఁగ్రొంజట్టుల తళ్కుబెళ్కుల పసందుల్ గేరుక్రొంజాయదీ
ప్తిన లోకంబులనేలు చిహ్నములతో దేదీప్యమాన ప్రభల్
గణుతింపంగల పుట్టుమచ్చ నుదుటన్ గళ్యాణరూపైకతన్
జననంబొందిననాఁడె సంపతిలె స్వచ్ఛందార్థ చంద్రాకృతిన్.

ఏదేశంబుల వజ్రపీఠముల దన్నెక్కించి సింగారపుం
బూదండల్ మెడవేసి, కప్పూరపు దాంబూలంబు లర్పించి మేల్
వేదండంబుల గొల్వుందీర్చి దిశలన్ బ్రేరేచనై జాతక
ప్రాధాన్యంబున బుట్టుమచ్చ ప్రతిభా భావ్యర్థ మెట్లున్నదో ?

కలికివాల్ చూపుతోం గవితాసరస్వతి
ప్రభఁగొన్న యగ్గురుపాలనంబు
శ్రీనాథు కైతల సిద్ధిఁజెందిన గొండ
వీడ్పురి సామ్రాజ్య విభవపటిమ
తెలుఁగురాడ్దినకరు దివ్యతేజోరత్న
మాణిక్యమకుట సమగ్రమహిమ
ఆంధ్రభారతి సోమయాజి కలానఁ పూ
యించిన సిద్ధన్నపేం ద్రుఁ జరిత

లచ్చులై యచ్చపుంబుట్టు మచ్చగాగ
ప్రతిఫలించెను, భావుక భావిభాగ్య
విజయదుందుభినాదముల్ విశ్వనాట్య
రంగమందెట్టి ప్రతిభతోఁ బొంగులిడునొ ?

# ఆధిపత్యము

పరిపక్వప్రతిభావిలాస విజయప్రాగ్భార కీర్తిద్యుతిన్
సరవింగుల్కొడి గట్టమంచిపయి శస్త్రంబౌ బరోడాగ్ర రా
జ్యరమాహ్వానపు గ్రొత్తముత్తెముల సేనల్ జల్లి క్రొంజూపుతో
మురిసెన్ గాలెజిప్రిన్సిపాలు పదవీభోగంబు లర్పించుచున్.

జ్ఞానసముద్రముం దోణకి నవ్యయుగాభ్యుదయాలవాలమై
పూనిన కమ్మభావముల బుష్పాడిగాడ్పు కరళ్ళవీచి, సం
ధానిత దివ్యనాగరకతా మకుటంబును రాజ్యలక్ష్మికిం
గానుకగా నొసంగెను, వికాసవిభూతులు తొల్కరింపగన్.

మెచ్చి బరోడానరపతి
ఇచ్చిన రెడ్డిప్రతిభావివేక చరిత్రం
బెచ్చిన భారతదేశము
బచ్చనిభావములతోడ భాసిలునంచున్.

వలయు మేలగు ధనవస్తు వాహనములఁ
దన్నుదీవించి యభిషేకతైలమద్ది
బంపె నమెరికాదేశంపు బహుళనవ్య
నవ్యభావ పెన్నిధులగొండల బెకల్ప.

జ్ఞానపతి మెప్పుతో నమెరికాజని, భారతదేశ ప్రాజ్య భా
వాపగ మాధురీనిధుల యభ్యుదయంబుల మేటి పోటితో
వ్యాపకమైన తద్విధులనన్నిటి నేరిచి 'మార్లె' శిష్యుఁడై
రేపెను గోఖలే జెలిమిరీతి, మఱింత కుశాగ్రబుద్ధులన్.

మాధురీ భావసంసిక్త మహిమఁదనరు
ప్రథరవీంద్రు 'గీతాంజలి' పాకమెఱిఁగి
పరమజోస్యంబువేడ్క సంభాషణమున
జెప్పె, నోబిలుకానుక దప్పదనుచు.

మీకిచరించు రెడ్డి కుసుమించిన జ్ఞానలతాంత గంధసం
భార పరంపరల్ దిశలవ్యాపితమయ్యె. ప్రశాంతుఁడౌ మహీ
శూపు మహేశు సౌహృదయశోభనరాసులు బూలుబూచి వి
స్తారముదంబుతోఁ బిలిచి స్వాగతమిచ్చెను రాజ్యకన్యలో.

పౌనరంగాఁ దనజ్ఞానశక్త్యసువులఁ బుంఖాను బుంఖంబుగాఁ
గనుగుంఫించి, వినూత్నమార్గములఢంకాప్రమోసి, విద్యామహా
జనయిత్రీ నవరత్నసంకలిత పూజాపీఠి నిర్నిద్ర శో
భనపుఁ స్తోత్రకిరీట మందుకొనె దీవ్యత్కీర్తి మోహింపగన్.

అతడేరాజుగ, రాజే
యతడుగ, నన్యోన్యభావనార్ద్రానందా
గతిగన వ్యవహారంబుల
జతగూర్చుచునుండి రెంతొ! శ్రద్ధాభక్తిన్.

కరుణామయ దృక్కుల ని
ర్ఝర గంగా వీచికా ప్రవాహం బొకటన్
బారి పొరి గోసంగులపైఁ
గురియింపగ వలయు నన్నగోరిక వొడమెన్.

అన్న వస్త్రార్థ సౌకర్య మాది గలుగు
వసతి గృహముల నెన్నేని వాంఛ నిలిపి
నిమ్న జాతి విద్యార్థి సన్నిహిత రక్ష
కై తపించి శ్రమింపఁ గాఁ బోతరించె.

అగ్ర జాతి విద్యార్థు లాయాస మనుచుఁ
దెప్పుకొన కుండ, మాల మాదిగల తోడ
నంటు తన మెన్నకయె, విద్య నభ్యసింపఁ
దగునటంచు శాసించెఁ దత్త్వం బెఱింగి.

కలతలు పుట్టె రాష్ట్రమున గత్తుల తోవడిఁ గ్రుమ్మినట్లుగాఁ
గలఁగి కులీను లందఱుఁ బ్రగల్భము లాడుచు రెడ్డి నేతపై
పలుపగలూని భూవిభుని పాలికి బంపిరి గొప్ప నేరముల్
సలిపె నటంచు వేల్జనుల సంతకముల్ గల విన్నపంబులన్.

అలవిశ్వేశ్వరమంత్రితోఁ మెలఁగుఛాయా పుత్రకుల్ బోలు దు
ష్టులునున్ నవ్వారి రెడ్డి దెబ్బదినునంచున్ హర్షముప్పొంగి, ని
శ్చల ధైర్యంబున వారి దుష్కృతుల లేశంబున్ పొలిన్ బోక స
త్కళతో జేని బహూకృతిన్ గనెవిపక్ష శ్రేణిబెండై పడన్.

అమిత జ్ఞాన సుమాంజలి ప్రకట భాగ్య స్తోత్ర దక్షత్వమున్
ప్రమదంబున్ విరఁజిమ్మి, భూపు ననివార్య ప్రేమ తైలాభిషే
కముతో, మించు ప్రపంచమున్ దిరిగివీకన్ నూత్న విద్యామహో
ద్యమ ధర్మంబుల నెగ్గి, పండిత వరుండై తేలెఁ బ్రఖ్యాతిగన్.

మీఁదట—

పోటి రవంత లేని జయపుష్పపరాగ కిరీటధారణా
పాటవమంది, శాసన సభామణి మందిర సౌమ్యసీమలో
మేటరియై గడంగి గడిమీరిన గండరగండఁడై వడిన్
మాటకుమాటకున్ విలువమార్కొనఁజేసెఁ బ్రశంస నీయుతన్.

ప్రమదంబున్ దన జ్ఞానశక్తుల యథాప్రజ్ఞాళి నేతత్ప్రభా
ప్రముఖాంతఃకరణాబ్జ పిశ్వజగతిన్ వర్ణించి ప్రత్యగ్ భా
వము లూరించి శిరంబు లూపఁగల దీవ్యత్కీర్తి స్థాపించి భా
గ్యము సేకూర్చెను జెన్నరాజ్య రమణీ కళ్యాణియై పొల్చగన్.

అత డసెంబ్లీ సభావేది నధివసించి
శక్తుల వెలార్చి మాటాడసాగినపుడు
స్తంభములువీను దోసిళ్ళ సంఘటించి
శుద్ధ మాధుర్య రసముల జుఱ్ఱుకొనియె.

రాజ్యమవార్యమై సిరుల రాసులతోఁ దులదూగి పొంగగా
బూజ్యనవీన పూర్వమత భోగమునచ్చున బోసిజ్ఞానవుం
బ్రౌజ్య దురంధరత్వముల బాకములన్ సమకూర్చి తత్ప్రభా
బూజ్యతఁగాంచె మేటియను ముద్దుల గీరితి బెండ్లివందిటన్.

'దిటవౌ ప్రజ్ఞలతోడ పానుగలు మంత్రిత్వంబు వోనాడుపెన్
తటకాపాటున' కేనగించి, ప్రబలాంతశ్శక్తి జృంభించుచున్
నటదీశానుని పోల్కియిచ్చిన యుపన్యాస ప్రభావంపు లం
పటతన్ శాసనసభ్యసీమ వణకెన్ బ్రహ్మాండ నిశ్చేష్టతన్.

ఆ సభయందు నాఁడిడిన యద్భుతభావము జిమ్ము మేలుప
న్యాసముతో సమానమగు నట్టిది యింతకు నెవ్వఁడేని యే
దేశమునందునైన గడితేజిరియొసంగిన యట్టుభూమియే
రాశికి గాంచలేదు, యజరామరమై గణుతించి పొల్చగన్.

వేలుపుబెద్ద తద్ధృదయము వీధులవేసము నచ్చుఁబోసె, భా
షాలలితాంగి నాలుక బ్రసన్నతనిల్చుచు నాట్యమాడగా
జాలె, ప్రశాంత తేజములుసాగె ముఖంబున, దక్షతాది దు
ర్గాల గమింపఁబొంచె నధికారపు దండము నిర్భయంబుగన్.

# ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపన

అసముగడించి కౌన్సిలుసభాంతర సీమల బెద్దపీఠితోఁ
బొసఁగుచుఁ బాతొపానగలుముఖ్యప్రధానుల వేటిసాయపుం
బసఁగొని, గట్టపుందపము బంటలగూరిచి 'యూనివర్సిటి'గా
వెసనెలకొల్పె నాంధ్రుల సవిస్తర శౌర్యకథల్ జిగిర్చగన్.

అందుపాధ్యక్షపదవీ స్వయంవర మహి
మోన్నతోత్సవ భాగ్యసంపన్నిధాన
పద్ధతులగూర్చ జ్ఞానప్రభావకలన
దనరు యోధానుయోధులు తారసిలిరి.

కుసుమించి బులిపించు కూర్వనిముత్యాల
వరుసల జిగిఁ దలంబ్రాలబోసి
కులకుల మొలిపించు కూర్చిన రతనాల
నైగనిగ్యపు దోరణము లమర్చి

సానబట్టిన ముద్దుజాతివజ్రంబుల
జలుఁగుబుష్పాడుల ముగ్గులనుబెట్టి
కన్నాకు చిన్నారి పొన్నారి పూవుల
గమకంపు దేరుల గములగూర్చి

దీప్తిమైదిద్ది తీర్చి భూదేవియంత
పసరు జిగురాకు జాలరుపందిరులను
నాకసమునంటు మురిపంపు టరుగుగముల
జికిలిగావించి రబ్బంపు సిరిజనింప.

జిసుగారత్తరు కమ్మతావులమిరాసిఁ బొల్పుచిత్తారిగి
న్నెలతోవిప్పిన పూరజఃకలితమౌ నీరాజనంబెత్తి న
ల్గుల సొంపార్చి, యశోదుకూలములచేఁ గోటీరపాటీరపుఁ
వలపుల్గూర్చి రఖండభాగ్యముల విన్యాసంబు జొబ్బిల్లఁగఁ.

పలువింతల్ గుసుమించు నిస్తులిత రంభా స్తంభసౌభాగ్య దీ
ప్తులబందిళ్ళ హజారమందు, నగిషీపొందమ్మి క్రొమ్మెగ్గ కూ
ర్పుల జోడించినచిత్ర చిత్రమగు మేల్ బొమ్మల్ రచింపించి సొం
పులుబొంగారస్వయంవరాసనము నేర్పుల్గూర్చిరత్యున్నతిఁ.

"పాత్రోపానుగల్ జయపురపార్థి" వోత్త
ములు గవర్నరుతోపాటుగలిసి యచట
బెండ్లిపెద్దలునై నిండుప్రేమఁదనర
శ్రీ స్వయంవరసీమ నాసీనులైరి.

గాంధీమహాత్ముఁడు గన్నిటవడకి దీ
ర్చిన కలంకారి చీరను ధరించి
భారతాంబామణి బంపిన పారాణి
జిలుగు స్వాతంత్ర్యంపు జీరవ్రాసి
తెలుఁగుఁగై తల తల్లిదిద్దిన భావాల
వజ్రకిరీటంపు బసలదోఁగి
ప్రకృతియమర్చిన పరమసౌభాగ్యంపు
గస్తూరితిలకంబు గుస్తరించి

భువనముల మోహజలధిలో ముంచితేల్చు
చలరునూగారు రామణీయకము, సగము
పైట తెరచాటునవిహార ఘణతిఁజూప
విశ్వవిద్యాలయపు గన్నె వెడలె మురిసి.

కేల సమస్త సత్కళల కీర్తితకీలితశస్త కేతకీ
మాల ధరించి, మోహ పరమప్రభ కాటుక కంటి చూపుతో
దూలుచు గింకిణీ ధ్వనుల తోరపుటారతి నాంధ్ర విశ్వ వి
ద్యాలయ భవ్యకన్యక స్వయం వరవేది వరించెఁ ప్రేముడిన్.

అలదిగ్దంతుల వంటి పండితుల దీవ్యత్సింహ పీఠ ద్యుతుల్
అలరెన్, శోభిలి సత్కవుల్ బిరుద పద్యంబుల్ బఠింపించగాఁ
దలిరుంబ్రాయపుముద్దుపెండ్లికొడుకై త్రైలోక్యవిద్యాంసుఁడై
వలపుల్ దేల్చెడిరెడ్డి హస్తమును జేఁబట్టెన్ ప్రసూనాంజలిన్.

7)

ఖిలమై కాలనదీ కృపీటమున వ్యాకీర్ణంబు నై మ్రగ్గి చిం
తిలు యోదంత నలంద తక్షశిల వేంగీ ధాన్య కటకాదిగా
గలవిద్యాలయభవ్య పద్ధతుల జొక్కం బోల్కి యూన్వెర్సిటీల
నిలుపం గోరెఁ బ్రపంచ మందొకటిగా నిస్తంద్రమై రాజిల్లఁ.

* దిఙ్నాగ కవి విరాడ్డిన కరాఖండ త
త్త్వమహాత్త్వ విధ్యుక్త ధర్మ మెఱిఁగి
♦ నాగార్జునాచార్య నవ్యశైల్పిక కళా
చాతురీ విలసనాచార మెఱిఁగి
‡ ఆర్య భట్టు మహోన్న తానంద నిస్తంద్ర
విజ్ఞాన రాసుల విలువ గూర్చి
§ శంకరాచార్య నిశ్శంక బాహుళ్య ప్ర
సిద్ధ చారిత్రంపు సిద్ధి నెఱిఁగి.

---

ప్రాచీన కాలంబున నీ క్రింది విశ్వ విద్యాలయంబులు మహోన్నత స్థితిలోఁ బేరెన్నిక గాంచినవి.—

* ఓదంత
తక్షశిల
విజయపురి } ఈ విశ్వ విద్యాలయాధ్యక్షుల చరిత్రంబు గనుఁగొననగు

♦ నలంద - ఆర్యభట్టు

‡ ధాన్యకటక - నాగార్జునుఁడను మహనీయుఁ డధ్యక్షుఁడు. గుంటూరు మండలాంతర్గత, పల్నాటిసీమ, కృష్ణానదీతటంబున గానఁనగు.

§ వారణాసి - శంకరాచార్యుఁడు
నవద్వీప - శ్రీరూప, సనాతన గోస్వామి, అను నిరువురు.
వేంగి - భావవివేక - దిఙ్నాగాచార్యు లను నిరువురు.

ప్రథ 'సనాతన గోస్వామి,' భాసమాన
రూపు 'భావ వివేక,' 'శ్రీరూపు,' బుధుల
పద్ధతుల దోఁగి వాల్తేరు భవ్య నగరి
నాంధ్ర విశ్వ విద్యాలయ మమరఁజేసె.

అచట నానావిదేశ కళాభ్యుదయము
లుట్టిపడ, బెచ్చుకలవంటి యొజ్జలను గు
దిర్చి, తగు వేతనంబుల దిద్ది తీర్చి
ప్రాణములు గుత్తకిచ్చి పోరఁగ దొడంగె.

తెలుఁగు ప్రధానభాషగను జేర్చి, మహారసపుష్ట చాతురీ
విలసన గాన్యరాజములబిండి, సమస్తము గమ్మజాను తె
ల్గుల నుడికారపు న్నగిషికూర్పులతో వడిబోధఁజేయగా
వలప్రున శాసనంబొసఁగె బానిసయై జగజంపు సేవతో.

పెరిఁగు సాలునకొకతూరి బ్రిటిషు హైంద
వ ప్రభుత్వం బొసంగు ద్రవ్యంబు, సంస్థ
యెక్కుడగుట చాల కునికిసొక్కి సోల
వలసివచ్చె నార్థికపు టిబ్బందిఁజిక్కి.

విక్రమదేవవర్మ పృథివీపతినిస్తుల సౌమ్యసత్కృపా
ప్రక్రియ దృష్ట్యనూన మకరందసముద్ర నితాంత వీచులన్
సక్రమపద్ధతిన్ విసరి సాలుకు బ్రేముడి లక్షరూప్యముల్
విక్రమదీక్షతో నొసఁగి పెన్‌బడి పోషణకొగ్గ ధీరతన్.

తిరువాన్కూరు బరోడదక్కను పవిత్రీభూత రాజ్యత్ర యీ
పరిపూర్ణ ప్రమదప్రభుత్వ విలసత్ భాగ్యైక కళ్యాణ ని
ర్భరకీర్తిప్రభ 'నాంధ్రయూనివరిసిటీ' వర్ధిల్లి రాజిల్లగా
గురుయత్నంబు లమానుషత్వమునఁ జేకూర్చెఁ బ్రసన్నా
కృతిన్.

నాలుగంచుల నవయౌవనంబునిండి
కొసరి విలసిల్లి వెలసిన గొండవీటి
మేటిసామ్రాజ్య సత్కళామేయ వైభ
వసమృశంబునై రేవితోఁ బ్రబలదోడఁగె.

కొలఁది వర్షాలుమాత్రమే గొలువుఁజేసి
త్యాగమున దదుద్యోగ హార్మ్యంబువీడి
రక్తసంసిక్త కాంగ్రెసు రణముదూకి
భరతమాతకు కర్పూరభజనజేసె.

సకలప్రాభవ కాంతిపుంజముల భాస్వంతంబు జిత్తూరు స్థా
నిక సంస్థాధి పతిత్వ మెన్నికల కెంతేరాగ, నవ్వేళ నీ
సకలప్రాభవరాశికిన్, ఘనుఁడు కృష్ణారెడ్డికిన్ పోటి పూ
నికమైసాగుచు స్పర్ధహెచ్చె హితులెన్నే కార్యముల్ దీర్పగన్.

ఎన్నిక లెన్నిసార్లు వెలయించిన నిర్వ్యరకప్తు సమ్మతుల్
గ్రన్నన తుల్యమై నిగుడగా, నది పద్ధతిగాదటంచుఁ బే
రెన్నికగన్న పాలకు లహీన మనీషను జీట్లువేసి! రా
సన్న జయంబు రెడ్డిని బ్రశస్తముగా వరియించెనయ్యెడన్.

కాకినాడలో జరిగిన కాంగిరెసు, స
భాధిపత్యంపు టెన్నికలందు గొంత
గలభవలకొనె, లాటరు క త్రిపదను
ఘనత చేకూర్చె రెడ్డి పక్షంబునిలిచి.

అటుపైఁ గాంగ్రెసు దుండగంబులకు జిత్తాబ్జంబుదూగాడి, దు
ర్ఘటుఁడై తత్పదవిన్ త్యజించితన*పూర్వప్రాభవంబందెఁబెం
దిటవున్, రెడ్డికిలేదు నిల్కడని యెంతే భారతక్ష్మోణి లం
పటతన్ హాకొనసాగెఁ. తద్విమలభావస్ఫూర్తిగుర్తింపమీ.

## ప్రతిభా స్వరూపము

లలిత కవిత్వ సంపద విలాస పరంపరలందుఁ బ్రజ్ఞమై
గులికెడి రాజకీయపు నిగూఢత రాంశములందు, సాహితీ
విలసనమందు, రెడ్డికి నభిజ్ఞత విజ్ఞత దక్షతాది స
త్కలన విశేషమైతగు, నఖండ తపఃఫలపుణ్యరూపమై.

భారతమందుఁ బేరుఁగొని పండితులై మొనగాని శీవితోఁ
గూరిమిపేరిమిన్ జదువుకొన్న మతేవుర యందొకండునై
కారణజన్ముఁడై కవినికాయము హారతులంపఁగీర్తి వి
స్తార మహాభిషేకముల ధన్యతజెందెఁ దెనుంగునేలలో.

* వైస్ ఛాన్సలరుపదవి

నిబిడీ కృతంబునై యుబికెడి స్వాతంత్ర్య
రస మహావార్ధుల వెసస్రవించి
రాజకీయార్థ శాస్త్ర మహత్త్వ కళ్యాణ
కర్పూరగంధ మంగళము జల్లి
జ్ఞానంపు మేదు రాంతశ్శక్తి వజ్రాల
కుల పర్వతంబుల గొనలవిప్పి
అఖిల గుణోపేతమైన సారస్వత
ప్రత్యగ్ర భావ సంపదల గురిసి

తతనిరంతరనిష్ఠుర ధర్మఘణితిఁ
దపముగావించి, త్యాగరక్తంబులోడ్చి
ప్రేమతో నాంధ్ర యూనివర్సిటికి నంకి
తంబొనర్చె జీవితపు గ్రంథంబునంత.

ధనమున కాసవహింపక
తన వేతనమందు సగము ధర్మత్యాగం
బున విద్యాలయ పోషణ
మునకై యిప్పించుచుండె పూర్ణ హృదయుఁడై.

తనరంగా మతిమంతుఁడై పొలుచు*రాధాకృష్ణుఁడొక్కంట దీ
క్షను గీర్తించుచు, రామలింగని కదృష్టం బొక్కడున్నట్లు జె
ప్పె నదృష్టంబన రాదు,జ్ఞానమహిమావేశంబు లుప్పొంగి యా
తనిలోఁ జిన్మయరూపమెత్తుకతమున్ దర్శించెసౌభాగ్యముల్.

---

* శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు.

మదనమోహన మాలవ్య, సదమలాత్ముఁ
డాషుతోష ముఖర్జీల ననుగమించి
విద్యకై దేశకల్యాణ వృద్ధికై మ
హోపకారంబు గావింప నుజ్జ్వలించె.

తన విజ్ఞానము లోకపూజ్యమయి, విద్యాదేవి చారిత్ర మం
దున గీర్తింగనియున్నఁ, దానొరునియందుఁగ శక్తిసామర్థ్యవా
సనలున్నట్లు గ్రహించుచోఁ; బలెప్రశంసా శోభనార్ఘ్యంబుచే
వినువీధిందులదూఁచు, జాతిమత విద్వేషంబుఁ బాటింపమిఁగ.

తనచే దీవనలంది నిస్తులదయాదాక్షిణ్య పీయూష వా
ర్ధిని దోఁగాడియు, గష్టభారమున వ్యర్థీభూతులై ప్రమగ్న జో
చ్చిన సన్న్యాసులు నేఁడు, పూజితయశశ్శ్రీ) వజ్రలోకంబునం
దుననూ రేగుచునున్నవార్ మదపుటేన్గుల్ వోలె గోరాడుచుఁగ.

ప్రాపంచిక ఖ్యాతిఁబడసిన మొనగాండ్ర
తలమానికంబునై తనరినాఁడు
ప్రతిదేశమందున బ్రతిపల్లెయందున
బరమమిత్రులగాంచి ప్రబలినాఁడు
విశ్వప్రపంచాన వెలయుపెఁగబడి పండి
తుల బరిచయమంది తోఁచినాఁడు
గండరగండలై గ్రాలురారాజుల
మూఁతి చిక్కంబునై మురిసినాఁడు.

అవని రాజకీయవ్యవహారకార్య
భారమం దఖండజ్ఞానభాగ్యమంది
విజయప్రస్థానభేరి శబ్దించినాఁడు
తెలుఁగుదొరసాని దేవిడీ తిన్నె నెక్కి.

అంచితమైన శాసన సభాంతరసీమలు చిద్విలాసమై
మించ, నమాత్యులంగెలిచి మేళ్లొసి, ప్రజ్ఞవెలార్చుచుం బ్రద
ర్శించిన హాస్యపూరిత విశిష్ట మహత్తర శాసనంబు ల
భ్యంచితరీతి దేశముల ప్రాఁకెను భాసిలు దివ్యతారలై.

అతని దృగ్గోళరసార్ద్ర వాగురజిక్కి
భ్రమసి కులుకని కావ్యంబులేదు
అతనికలంబు చిత్రితచాతురీ శాస
నంబులగొనని స్థానంబులేదు
అతని మహాద్భుత హాస్యప్రసంగవై
భవమెఱుఁగని జనపదములేదు
అతని రాజకవిత్వ వితతమార్దవ ధోర
ణీపాక మెఱుఁగని నేలలేదు

జన్మభూమి దుర్దాంత దాస్యప్రచండ
కావ్యములగూర్చి కన్నీరుగార్చి యంగ
లార్చి వాపోయి యల్లాడనట్టి యణువు
లేశమునులేదు తనమనఃకోశమందు.

వాదములలోనఁ దన ప్రతిపక్షులైన
వారి హృద్గతావేశ దుర్భావ పర్వ
తముల బెకలించి గలచు మొత్తందనంపు
బూలతూపుల వలపు జొంపాలవిసరి.

బాసకై దేశరక్షకై బడినపాటు
లరసి మెచ్చి ప్రభుత్వంబు, 'సరని', 'డాక్ట
రని' పదాడంబులొసఁగి తన్నుపమాన
భక్తితో గారవించెఁ బుష్పాలగురిసి.

మాటల యందు బ్రహ్మాండ భావోద్రేక
రసవాహినీతతుల్ రచ్చ జేయు
చూపు జగంబున జొక్కంపు జల్లని
పండు వెన్నెల నిగ్గు బాఱు దీఱు
వ్రాఁతల యందున బరువంపు వరముల
గ్రొక్కాఱు మెఱుపులు గులుకు చుండు
నడకల వినయాది నవ్యంపు నాజూకు
మొగిలి పుప్పొడి దుమ్ము పొగలు రేగు

వదన మందున గారుణ్య వైభవాది
దేవతా కాంత లమృతంపు దేనెజల్లు
జిలుకు చుందురు, మోహంపు గులుకు లొలయు
ప్రేమ గీతాల బాడి పరిమళింప.

అలరుంగ్రైతల ముద్దు జవ్వనపు గన్యారత్నముల్ బన్ను చూ
పుల గ్రొక్కాఱుల మోహావా గురుల సొంపుంగమ్మ గేదంగి డో
లల హాయిం దులదూగుచుం బ్రకృతి లీలా మాధురీగానముల్
వలపుం బాడుచు బండి పోవును రసప్రాశస్త్య ముప్పొంగగన్.

ఆంధ్ర తేజంబుతోఁ బొంగులాడు ప్రజ్ఞ
క్రిష్టియను కళాశాలలో రేకలెత్తి
కేము బ్రిడ్జిలో గరిడీలసాము నేర్చి
తతబరోడ మైసూరుల దాండవించి
ఖండ ఖండాంతరముల నఖండ యశముఁ
దనరి, శైథిల్యమున నేఁడు మునుగు చున్న
రెడ్డి రాజుల యేల్బడి దొడ్డ దెబ్బ
దేడు దుర్గంబు లొక్కపై యీడు లేని
పుట్టు మచ్చగాఁ దన ఫాలమున జనించి
విశ్వ సన్నుతమైన యావేశ మొదవు
విశ్వవిద్యాలయంబుగా వెలసె, కావ్య
సుదతి నవ్వుల క్రొక్కాఱు సొంపు నింపి.

ఘనతరాంధ్ర చరిత్ర లోకంబునంద
నూన విశ్వవిద్యాలయ నూత్నశకము
బేరిమిని గూర్చినిలిపిన వీరు లేక
లేదు రెడ్డి ప్రపంచంబు లెక్కబెట్ట.

విద్యార్థి తతికొక్క విద్వాంసుఁడుగను, భా
షాభిమాని కొకమహా విమర్శ
కుఁడుగను, దేశభక్తుని కొక్క దేశాభి
మానిగ, బ్రహ్మాండమైన రాజ
కీయవేత్తకు భయాకీర్ణ మేనుఁగు స్వప్న
సింహంబుగాగను. శ్వేతజాతు
లకు భ్రమఁగలిపించు నొక నల్లవానిగ,
పరులకు సామాన్య పురుషునిగను,

గానుపించు నీవక్తను గన్న తెలుఁగు
తల్లి సంతోష పూరిత తపమొకింత
కొలఁతబట్టను, దులదూచి గొట్లనింపఁ
దరమె ! మానవజాతికి ధరణియందు.

ప్రాకట పూజ్యసత్కళల రాసులతోఁ దొణకించి పొంగి ర
త్నాకరతుల్య భావముల కాకరమాతన మోముగాంచ, నెం
తో కమనీయ మార్దవపు తూగుదలన్ సుకవిత్వ వైఖరీ
పాకము గౌఁగిలించుఁ బరిపక్వమహత్త్వము సంక్రమింపగన్.

మునుభీష్ముండవివాహిత వ్రతమతంబున్, దండ్రివాంఛాభి లా
షను నీడేర్చిన యట్లఖండమగు ప్రజ్ఞాజ్యోతి వెల్గించి దీ
క్షను దెస్గుం బునరుద్ధరింపఁగల కాంక్షన్ బూనిబెండ్లాడ మా
నెను, స్వాతంత్ర్యపుబ్రహ్మచర్యనిరతిన్ నెగ్గింపమేధాద్యుతిన్.

ఆనతియిచ్చెనా యదిశిలాక్షర, మే కులహీనునైననుం
బూనికమెచ్చెనా యతఁడు పూజితుఁడో, వ్యవహార రంగమం
దానిన వైరినైన వినయాధిక భక్తినిఁగొల్చె, నిచ్చెనా
యేనుఁగుపాడి, రెడ్డి సుకవీంద్రుని కేరు సమానులిద్ధరన్.

పుష్పాదులవంటి భావాల బుటము వెట్టి
పెదవి గదలించి మాటాడ గదలినపుడు
గంటలు గడియలుగదోఁచి గానబడు, వి
నుకొలఁది వినంగఁ గోరికలూన్లుకొంచు.

ప్రత్యూషఃకాల సమయసంరంభమందు
రాజకీయాది కార్యభారంబు నెఱపు;
మాపుకడలందు సాహిత్య మధురగతుల
గూర్చి చర్చించుఁ బండితకోటిబిలిచి.

కొలబట్టుచున్నారు కోట్లలోఁ దనదు వి
స్తార యశంపు వజ్రాలపంట
తులఁదూఁచుచున్నారు విలువ కందని మేటి
జ్ఞానంపుమురువు బంగారుకొండ
వెలగట్టుచున్నారు తలఁపు కందగరాని
కవితల తేనెబిందువులజల్లు
పడిగట్టుచున్నారు పరువంపుఁదన కలం
బు వెలార్చు భావదీప్తులపసందు

తిన్న జెన్నారుపల్కు పందిటకడాని
జిలుఁగుభావాల మెసవెడి తెలుఁగునోరలు
వాపుకోలేరు తనదు సేవాఋణంబు
జన్మజన్మాలకైన బ్రశాంతులగుచు.

కత్తులబావిలోపల విగాహితమై గడితంపురాజ్య సం
పత్తుల శాలవాహినుల బాకులకుఁ బలియిచ్చి కీర్తితో
మత్తిలు రెడ్డిభూపతుల మానిత శౌర్యకథావిధంబు రే
కత్తెను తద్విశాల గుణహేమహారిన్మణి రాజవీథులఁ.

విశ్వమానవకళ్యాణ వేదులందు
బ్రథవహించిన రెడ్డిభూపతులు గెలిచి
తీర్చిన విజయకీర్తిచంద్రికల ఖనికి
బ్రాణములవోయుచున్నాడు శ్రమసహించి.

పొందిక విద్యలోఁ గలుఁగు భోగమెఱుంగ రెఱింగిరేని ని
ష్యంద మరందబిందువుల సారముగ్రోలగలేరు, గ్రోలి రా
యంద మెఱుంగలేరెఱిఁగిరా! కవులఁ దయబ్రోవలేరు పే
రందిన రెడ్డిపండితుఁడె? యన్నిటమించిన ధీరుఁడందరఁ.

పంచములన్న మిట్టిపడి ప్రాణముదీసెడునట్లు దూఁకి నొ
ప్పించెడు వేళలందు ధృతిఁబెంచుచుఢీకొను త్యాగముఁచలా
యించి, జయేచ్ఛ పంచములకిచ్చి మహోన్నత సామరస్యమి
ప్పించిన గండడౌ తెలుఁగుబిడ్డడు తానె మదాంధ్రసీమలో.

చల్లదనాలపాలన ప్రశాంతశిలామయ సౌధసీమలం
దుల్లము బల్లవింపగ మహోజ్జ్వల కీర్తిసుఖాలమల్లె పూ
జల్లులగాడ్పు టుయ్యేలలసాంద్ర పటీర తుషారపుంజి, సొం
పిల్లుచుపీగు క్రొందెలుఁగుఁబిడ్డల వైభవమెట్టిదానొకో ?

కవుల కలాలకు గడియతీఱిక లేదు
తజ్జీవితంపు గ్రంథములవ్రాయ
చిత్రలేఖకుల కుంచెలకు తీఱిక లేదు
తన మహాప్రతిబింబతతు లమర్ప
నీరఖడ్గాలకు విశ్రాంతియే లేదు
తన జయకాంత పాదములగొలువ
మునిజన జపమాలకు నిలుకడయు లేదు
తన సత్యతత్త్వగాథల జపింప
తన మహాసాహసౌదార్య ధర్మపాఠ
శాలయందుఁ బ్రకృతిదేవి జ్ఞానభరముఁ
దఱచి పారాయణముసేయ దారసిలెను
పలుకుజెలిఁ బంతులమ్మగా వలచిబిలిచి.

"సమరాంతంబగు మాతృదేశమును స్వేచ్ఛా
గంధవాతూల పూ
ర్ణము గావించుచు, నర్థశూన్యతను నిర్భాగ్యస్థితిన్ దూలు నా
కొమరుం బ్రాయపు 'టాంధ్రయూనివర్సిటిన్' గ్రొంగ్రొత్త
తేజంబుతో
సమకూర్పందగ బోరుదంచుబలికెన్ శ్రద్ధా ప్రమోదంబునన్."

తనకు సముచితం బనుచు తట్టిన నెట్టన కార్యపద్ధతుల్,
గినియు పరాయి వాని కసి గిట్టిన గిట్టక సూనగించినన్
చాణకక, సుంతజంకక వినూతన ధైర్యనిసర్గ సాహ్స భా
వనమున రాయిఁ గ్రుద్ది తన వాదముచే గెలిపించు ధీరతన్.

కేంబ్రిడ్జి విద్యాక్షేత్ర కేంద్ర మందు
జ్ఞాన శక్తి సంజీవి గంధముల రేపి
తనకు, తన దేశ మాతకు వినుత కీర్తి
పుష్ప రథముల సమకూర్చె బుష్కలముగ.
ఆంధ్ర మైసూరు విశ్వవిద్యాలయాల
చట్టముల కట్టు దిట్టాల పట్టణములఁ
జుఱుకు గలిఁగిన తలఁపుల చూరవ నెఱపి
సృష్టిఁ గావించెఁ బండితశ్రేణి మెచ్చ.

తెలుఁగు జెండా పూల వలపు బుప్పొడి దుమ్ము
వాసించు నెవని యుప్పరిగ సీమ
కీరితి కొమరాలి గెలుపు నవ్వుల నిగ్గు
పరియించు నెవని యబ్బురపు గాథ
విజయ మంగళ తూర్య విభవాతిశయములు
దర్శించు నెవని చిత్తంపు గోట
పేదల కన్నీటి వేదనా చరితంబు
యాచించు నెవని దయాస్రవంతి

ఆంధ్రుల పురోభివృద్ధుల కాలవాల
మై దిశాదుల రాణించి యలరు చెవని
కీర్తి గంధంబు దిక్కుల గ్రీడ సలుపు
నతడు రామలింగారెడ్డి యధిపుఁడవని.

బాసలు పెక్కు వచ్చిన, నపారసమర్థత పూలుబూచి సం
తోసపు గమ్మగాడుపులు దోలిన, హూణముపైన ప్రక్కలం
దాసలు రేపు చుండినను, నక్షయమై తన యింటిముంగిటన్
వాస మొనర్చ్రుకొందెనుఁగుపై మతిదప్పడు మానడెప్పుడున్.

రెడ్డి జన సంఘమొందు సంప్రీతి నిలిపి
యాధిపత్యంబునొంది ద్రవ్యంబు గూర్చి
బీదరెడ్డి విద్యార్థుల వేతనముల
కై వ్యయించి విద్యాదాన మమర జేసె.

వఢ్లకును రెడ్లకును బేర్లు వసుధయందు
కొదువ లేదన్న సామ్యంబు గూలఁద్రోసి
తనదు శాఖాంతర వివాహధర్మ నిరతిఁ
దోలిఁ బ్రవేశింపఁజేసె విధ్యుక్తఫణితి.

ఆంగ్లభాషా విధాన మందమరియున్న
తతవిమర్శ నాజ్ఞాన సూత్రముల బిండి
చేవగల, తీపిగల తెన్గుచెలియ యొడిన
చెఱగి పోసెను నిక్కచ్చి చెణకు లేరి.

ఆంగ్లకావ్యంబు నెట్టులో యాంధ్రకావ్య
మటుల నాసతోఁ బఠియించు చనుదినంబు
వర్తమానాంధ్ర విజ్ఞాన వైభవముల
మించి పడిగట్టుచును గమనించుచుండు.

ఆంధ్రదేశ దారిద్ర్యంబు లంతరింప
భావియుగ పూరుషాళికి బథము జూపి
పొలుపు ఋషి వాటికలవలె తెలుఁగువాడఁ
జికిలిగావించుచుండె నాశీస్సు లొసఁగి

ఉత్తమజ్ఞాన సామర్థ్య ముజ్జ్వలంబు
లతుల మేధావిశేష ప్రభాన్వితంబు
దేశభాషాభివృద్ధి సందీప్తి కొఱకు
తఱచి వడ్డించుచుండె నెత్తురుల జిలికి.

అధికారవైభవ మబ్బియుబ్బిన దయ
మానియెఱుఁగని ప్రేమమయమూర్తి
ఉచ్చనీచంబుల కుసిలేని భావంబు
వాసించుకరుణా విలాసమూర్తి
తనయుత్తరువులేక దర్శించి మాటాడ
చనవు లొసంగెడి సాంబమూర్తి
తనకున్న విజ్ఞానమును గప్పిపుచ్చి పొం
గని నిరాడంబర శ్రమజీవి

రైతులం దెన్నికను గన్న రైతుబిడ్డ
కవులయందున కవి, యధికారులందు
న, నధికారియునై, కష్టనష్టములకు
నేవగింపని విద్యాఫణీంద్రమూర్తి.

వాఙ్మయ రహస్యమెఱుఁగు విద్వాంసులపయి
జల్లుచుండు సమ్మోహనాస్త్రముల బారు
చెఱకురసము వడ్డించు, నాశించుకొన్న
సభల రంజించు రసనమునాచి తూచి.

కోపమునకైన, కఠిన వాక్కులకునైన
గర్వమునకైన. నధికార ఘనతకైన
డాబుసరికైన హెచ్చుబడాయికైన,
తావులేలేవు వీని హృదయజగాన.

చనవుతోఁబొంగు భక్తి భావనమహత్తు,
స్నేహమునదూఁగు గౌరవశ్రీవిధంబు,
నమ్రతను గుల్కు గర్వవిన్యాసపటిమ
లతనికిఁ దక్కె, నతనికి నతడెసాటి.

ఆయాసమనక దేశాభివృద్ధికయి భా
గ్యముగూర్చు లోకోపకారజీవి
తనజీవితంబున ననదల కపకార
మమరింపఁబోని దయామయుండు

జాతి మతద్వేష వీతిహోత్రుని గూల్చి
పదవులాసంగు నిష్పక్షపాతి
కళల పోషింపను ఘనజీవితము, బలి
గావించి పోరాడగలుగు త్యాగి

తనకు వ్యతిరేకపక్షంబు తారసిలిన
నరుల ప్రేమతో మన్నించు నసమదర్శి
జగతి కాదర్శపురుషుడై జనహితార్థ
కార్యసూత్రాల యోజించు కర్మయోగి.

తిరుపతి పేలాపురముల
స్థిరతరమగు తనదుసేవ సిద్ధించిన ని
ర్భరవఃగుకీర్తికి మారుగ
విరచింపగ బడెను రెండు విద్యాలయముల్.

అతని కావ్యప్రసూన రసాతిశయత
లుజ్జ్వలోద్రేక భావమహోన్నతపు, స
మృద్ధియంత దోణకులాడి వృద్ధిదనరి
పొంగుచున్నది భారతమూషయందు.

వరముల గొన్ని కోరుకొని, వారిదివాణముజేరి దుఃఖపుర్
భరమున దీనులై వినయభావము జూపుచు గంటినీరులర్
గురియుచు వేడుయాచకులు గోరువరాల జవాబు మాత్రలో
నరయక రేపుమాపనక యౌనని కాదని జెప్పదక్షతర్.

ఎట్టి యనామ కుండగు కవీశ్వరుఁడైనను గష్టపాటుతోఁ
దట్టిన గ్రంథమొండొకటి తద్గతలంపులతో రచించి జూ
పెట్టను బంపుచో రసము బీలిచి చంకలు గొట్టి శోభతోఁ
బట్టము లేలగా గలుఁగు భావములంపును పూలబండ్లపై.

నవ్యభారత వర్ష విజ్ఞాన మహిమ
లతని మానస మంజూషయందుఁ బొంగి
నిండి సొంపారి పొర్లి ఘనీభవించి
విశ్వవిద్యాలయంబుగ విస్తరిల్లె.

రసికుఁడగుట, మహా హాస్యరసము గురిసి
కదనరంగంబుఁ బ్రణయరంగంబు జేయు,
పూలచెండులవంటి వాక్యాలవిసరి
యలము గ్రోధాగ్నిఁ బ్రణయసుధాబ్ధిఁ జేయు.

తెలుఁగుఁ గవిత్వపుం బసలు దీర్చిన తేనియ తెట్టెలందు జొ
బ్బిలు పరిపక్వ భావ నవవీథుల వజ్రవిమాన మెక్కి కై
తల జవరాంధ్ర కన్నగవు దర్శన భాగ్యపు ముద్దు లాటచే
గులికెడి తద్విభూతి పురికొల్ప కవీంద్రులు సంతసింపగన్.

విద్యా నగర రాజ వీథుల దొరలాడు
తెలుఁగు వాఙ్మయ వజ్రముల గడించి
తంజాపురంబున దాగిన తెలుగమ్మ
కన్నీటి కబురుల గాఁగిలించి

పెనుపినాకిని గర్భ వీచుల దోఁతెంచు
తియ్యకయితల గాదెలను దీసి
కొండవీటి పురాన గూలిన తెలుఁగు యు
గంబుల బూజుల గడకుఁ ద్రోసి.

కంటఁ దడి పెట్టి, రేఁగి ఖడ్గంబు దూసి
యతి సమర్థత దక్షత్వ మధిగమించి
తెలుఁగు వస్తాదులను మేలుకొలిపి రాత్రిఁ
బవలు చాకిరి సేయగాఁ బ్రమద మొడ్డె?

మాటమాటకు విలువను మాటు బెట్టి
గగన గంగానదీ వేగ గమనమునను
జాబు జెప్పు చుండ, *నటేశశాస్త్రి వ్రాయు
చుండఁ గనఁ గల్గు స్వర్గ సుఖోపలబ్ధి.

తనయూహారసవత్ప్రమాణముల తత్త్వంబొక్క వెయ్యేండ్లకై
నను, నానాఁటి విమర్శకోత్తముల విన్నాణంపు హృద్వీధిఁ ల
గ్గని నూత్నత్వపు సొంపు జొబ్బిలుచు నే కాంతులు వెదన్
జిందు చుం
డునుగాని! పొలిపోవనేరదు మహానూన ప్రభాధుర్యతన్.

---

* శ్రీనటేశశాస్త్రిగారు - శ్రీశ్రీ రెడ్డిగారి అంతరంగిక కార్యదర్శి.

భౌతికవికార శారీరభావనమున
ఒకటఁ దనయందు లోపంబులుండవచ్చు,
బ్రమసి పరికింప సృష్టిలోపంబె కాని
యద్ది తనలోపమౌనని యనుట దగదు.

ఆంధ్రభీష్ముఁ డస్త్రముల సన్న్యాసనిరతిఁ
బుచ్చుకొన్నంత దనుక ప్రభూతశక్తిఁ
దెనుఁగుఁతల్లికి నర్పించి దివ్యకీర్తి
గాంచుగాత దైవాభిషేకములబొంది.

## షష్ఠిపూర్త్యుత్సవము

అరువదివర్షముల్ దమక కాంధ్రమహోర్వికిఁ బ్రాణమోడ్చి నె
త్తురువిరఁజిమ్మి, కష్టముల తోరపుటీటెల పైగమించి దు
ర్భరమగు త్యాగమున్ గురిసి పన్నినసేవలు షష్ఠిపూర్తిగాఁ
బరిగొనె దేశదేశముల పండుగ పబ్బము నాచరింపగన్.

అది వాల్తేరు పురానవైభవమహోద్యత్కీర్తిఁగావింపగా
బదిలంబై నొకసన్మహూర్తమును సంభావించి సౌకర్యసం
పద లేర్పాటున దేశదేశముల కవ్యార్తానుగంధంబు స
మ్మదమున్ బంపిరిమిత్రసింహములు సమ్యగ్భంగిహర్షింపగన్.

కార్యభారంబు లీడేర్పఁ గష్టమనక
రాజగర్వంబు లచటఁ బరారుసేసి
వీరబొబ్బిలి మన్నీఁడు, విక్రమ ప్ర
భువరుఁ డెంతేని హర్షానబూనుకొనిరి.

అర్ధలక్షకుమించు రూప్యములకాన్క
లంపియేతన్మహోత్సవమందు పాలు
గొనుట కెందరో స్నేహితు లనుపమాన
భక్తితోఁబోయిరదియొక పండువుగను.

*అది గవర్నరునాధిపత్యమున జరుగ
నిశ్చయించి యాహ్వానసందేశమంపఁ
బరమముదమున మందిమార్బలముతోడ
తరలిపోయెఁ దదుజ్జ్వలోత్సవముగాంచ.

షష్టి పూర్తిమహోత్సవాస్థాన సీమ
నింద్రసభ కుద్దిఁ జికిలి జేయించి దీర్చి
భూతల స్వర్గమను భ్రాంతిఁ బోతబోసి
నిరతిశయ హర్షమునను సంధించినారు.

విలసిత పుష్పగుచ్ఛముల వేదికపై గొమరారుఠీవి భా
సిలు మన రామలింగ ప్రభుశేఖరు ప్రజ్ఞను, దేశరక్షకై
విలిచిన త్యాగసంపదల వేడుచు, ముత్తెపుఁబచ్చఁ బ్రాల జ
ల్లుల గురిసెఁ సభాధిపతి లోకము మెచ్చగ సంస్మరించుచున్.

ప్రతిభాశాలులు, దేశనాయకులు మిత్రశ్రేష్ఠులానంద ద
క్షత చేఁబంపిన మంగళ ప్రథమహోత్సాహంపు సందేశ ప
త్రతతిన్ భక్తిపరంపరం జదివి మోద ప్రాప్తినర్పించి భా
రత పీఠుండని ప్రస్తుతించుచును సంరంభించి రత్యున్నతిన్.

* సర్. ఆర్థర్ హోప్ గారు - గవర్నరు

ధీయుత విశ్వనాథకుల ధీరుఁడు భారతిమూర్తి సత్యనా
రాయణ, రామచంద్ర కవిరాట్ప్రభు, మల్లిడి సత్తిరెడ్డి, శో
భాయతమూర్తి * పింగళి మహాకవి, చక్కని స్తోత్రపద్యపా
రాయణతోఁ జిరాయువుల రాసుల బోసిరి పుష్పహారతిన్.

తన విజ్ఞాన మహాప్రభాకలితగాథన్ నాఁటి కేంబ్రిడ్జిలో
వినిచి త్రైపొలివోని స్తోత్రములతోఁ బేర్కొన్న మిత్రంబు లె
ల్లను, నుబ్బాతలనూగి పొంగి సదభిప్రాయంబు లెన్నోని దీ
వనతోఁ బంపి రఖండప్రేమమయ భావజ్యోతి వెల్గించుచున్.

షష్టి పూర్తిమహోత్సవ సంభ్రమంబు
లతిజయప్రద సుభగవాద్యములతోడ
దిక్కులెల్లను వికసించి తేజరిల్ల
జరుపఁబడియెను కీర్తిప్రశాంతిఁ జెంద.

తన సేవావిలసత్ప్రభావము లమందంబై దిశాస్తోమ మం
దున విద్యాలయమై తనర్చుటకు, నెంతోఁ దన్ను సన్మాన రీ
తిని బూజించుటకున్, గృతజ్ఞతను భక్తింజూపి కీర్తిధ్వజం
బును నాటించెను దెన్గుతల్లి సిగలో బుష్పాళ్లు బొబ్బిల్లగన్.

---

* పింగళి మహాకవి—శ్రీ పింగళి లక్ష్మీకాంతము కవిగారు. M. A.
ప్రధానాంధ్ర భాషోపన్యాసకులు,
ఆంధ్ర యూనివర్సిటి కాలేజి, వాల్తేరు.

తళుకుం బంగరునిగ్గు సొంపులను సింగారించి నిద్రించు కే
వల పాషాణమునందు జీవకళ భావస్ఫూర్తిఁ బండించి సు
త్రైలతోఁ దీర్చిన రెడ్డిగారి సుమహస్తేజో శిలావిగ్రహం
బలరారంగఁ బ్రతిష్ఠఁజేసిరట బ్రహ్మానంద సంధాతలై.

భాషాభిమానులు భవదీయమూర్తిని
జెడనిపూవులను బూజింత్రు గాత
మన యాంధ్రసీమ రెడ్లను నీదునామంబు
సుతులకు భక్తి నుంచుదురుగాత
అఖిలాంధ్రకవులు నిన్నాదర్శముగ నుంచి
యుద్గ్రంథములను వ్రాయుదురుగాత
అతులాంధ్ర విశ్వవిద్యాలయంబొక వేయి
యబ్దముల్ వర్ధిల్లి యలరుగాత
ఆంధ్రదేశ కుటుంబివై యలరు నట్టి
నీ యఖండ యశంబు నిర్ణిద్రమగుచు
పెరిగి ఖండ ఖండాతర వీథులందు
కళల వ్యాపించి మించి పిక్కటిలు గాక!

సర్వము సంపూర్ణము

# ఉపసంహారము

ఎన్నో యేండ్లు గతించి పోయినవి నే నీ దివ్య చారిత్రపుఁ
వన్నెల్ చెర్చిన గ్రీడలాడుటకు సంవాసించి, నాపూర్వ పుం
బున్నెంబుల్ ఫలియించి కట్టకడ సొంపుంగావ్య రూపంబుతోఁ
జిన్నెల్ నింపుచు నొడ్డు జేరితి యశశ్శ్రీలోక మర్థింపగఁ.

నే నశ్రాంతమనంత భక్తి బలమున్ నీ దివ్య రూపాధిక
జ్ఞానం బారసి పార వశ్యమున నెంతన్ గొల్వ గానుంటి, నీ
వే నేనైతినొ? నేననీవయితినో? భావింపంగ నీపైన నీ
యానందం బిటు పుట్టి పొంగుటకు భూపా! రామలింగప్రభూ.

కవివై భూరి విమర్శకుండవునునై గావించి భూగోళ పుం
జెవు లూపంగల బంటువై తెలుఁగు జేజేలంది సత్కీర్తి చే
దవుడుం బట్టిన నీ చరిత్రము దిగంతశ్రేణి హార్షింఁగా
వివరింపం దొరకొన్ననాడు చరితం బేధన్య మన్నింటిలో.

హృదయంబున్ మరు భూమి యం దెవరొ? తండ్రీ! యెన్నడో
యేలకో
పెద వెట్టించి రనంత నవ్య కవితా బీజంబు లుప్పొంగ, నీ
సదపాంగామృత బిందు బృందములచే సస్యంబు గావించినన్
బదిలం బైతగ దీవనంబు లిడు భూపా! రామలింగ ప్రభూ.

చాలి, దిగంత రాళముల సన్నుతి గాంచిన నీ చరిత్రపున్
వాలున భావగీతికల వాయుతరంగ విపంచికాశ్రుతిన్
దేలుచు బత్తి పాలికల దిద్దుచు బాడి భజింతు జన్మ జ
న్మాల కొలంది, సత్కవిజనంబు మనంబు చకోర చంద్రమా.

ఏలకొ? మేలు కొల్పె జగ దీశుల వ్రాఁతల తప్పు దిద్దగా
జాలి, దయార్ద్రమై యమృతసార మసారము గ్రుమ్మరించి ది
గ్జాలము హత్తుకొన్న మొనగాని కలంబు తెలుంగు నేలలో
మేలగు గద్దె నా కిడుచు; మెట్టికి ధన్యుఁడ పూజనీయుఁడన్.

నీ విజ్ఞాన కుశాగ్రబుద్ధి తతి కెంతే పొంగి తబ్బిబ్బులై
తావిళ్ళోడ్డుచుఁ దృష్టిదీఱని యనంతప్రజ్ఞఁ జాటించుచున్
లేవందీసిన నీ గురూత్తముఁడు 'మార్లే' నేనునై పుట్టి నీ
ప్రావీణ్యంబిటు జాటగల్గితిని కావ్యగ్రంథరూపంబునన్.

జ్యోతులయందా కండవగుచున్ బొలివోవని దివ్యకీర్తితో
బాతరలాడు, నీచరిత వ్రాసి జగంబున జాటునట్టి నా
జాతక భావభాగ్యముల సన్నుతి వర్ణన సేయగా తగన్
ధాతృమహేంద్రు లాదిసురధన్యులు చాలరు పోటియొడ్డినన్.

కైతయన్న భావోద్రేక కవులటన్న
దేహ ముప్పొంగి కరుణానదీజలాల
జిలికి వాల్చూపుటుచ్చుల జిక్కబట్టి
తఱచి ప్రేమింప నీకంటె దాత లేడు.

శ్రీరామకిషను ధాత్రీనాథు త్యాగంపు
స్ఫటిక హర్మ్యంబుల సంచరించి
గోపాల భూపాలకుని దయావారాశి
కవితాసువర్ణంపు గణిక లేరి
శ్రీయు మాప్రభు యశశ్శ్రీ వజ్రలోకాన
విజయభేరుల మ్రోసి విస్ఫురించి
రామచంద్రుని కృపారాశిలోఁ గన్నిటి
కబురుతో నిశ్చల ఘనతగాంచి

అప్పరాట్ప్రభుచంద్రుని యాదరమున
ధన్యతనుజెందె, నాగేశు దానవార్థి
దోగి, నీకృపాకారుణ్య దోహదమున
తెలుఁగు కవిరాజునై కీర్తిఁ దేలినాఁడ.

శరము మదాంధ్రభూభువన శారణకార్యపు వజ్జిరాల పం
దిసల ప్రసూనవేదికల దీవ్యదఖండ జయాంకముద్రచే
స్థిరమగు శాసనంబుల రచించు ప్రశాంతపు నీకలంబులో
వరముల వెన్ని లేవు ప్రభువా! శరణార్థుల నుద్ధరింపగన్.



# ఆవేదన

ఇక యెన్నేండ్లకొ నిన్నువంటి సుత సింహేంద్రంబునుంగాంచి, చం
పకమందార ప్రసూనడోలికలనూపఁ గల్గు భాగ్యంబు లాం
ధ్రకవిత్వావనికబ్బునో, తమ యనంతజ్ఞాన తేజంబు లే
రికి యర్పించితివో, ప్రమోదగుణమూర్తీ! రామలింగాభిధా.

ఘన సుస్వాగతమిచ్చినార యెదురై గౌఁగింటమన్నించి పె
ద్దన సూరన్నయు, నన్నపార్యుడును, వేదవ్యాసశ్రీనాథ తి
క్కన వాల్మీకియు, భట్టుమూర్తి, కవితాకళ్యాణి మోహింప సొం
పున రాణించిన కాళిదాసప్రభృతుల్ పుష్పాభిషేకంబుతో.

కొండలవంటికావ్యముల గుప్పిటబట్టి సముజ్జ్వలప్రభా
మండలముఁ వెలార్చి యణుమాత్రముగా నటచేతజూపి, యు
ద్దండుల స్వాగత ప్రసవధామ కిరీటమునంది కీర్తి బ్ర
హ్మాండము గౌఁగిలించిన మహా ఘనశాలివి లోకమూగగఁ.

దేశము రాజకీయ దురదృష్టచరిత్రల కాలవాలమై
గాసిలుచున్న మాట మనగాంధివిధాతకుజెప్పి శాంతి సం
దేశము భారతీయులకుదెల్పి సమైక్యతతోమెలంగ వి
శ్వాసపు పూలజల్లులనుజల్లుమ దిక్కులు సంపతిల్లగఁ.

ఆలదిగ్దంతులవంటి సత్కవుల కావ్యగ్రంథ నిక్షేప రా
సుల మాధుర్య తరంగమాలికలపై సొంపారిమత్తిల్లి బో
ద్ధల విజ్ఞానచరిత్రలం గనుచు విద్యానందనోద్యాన సీ
మలవర్తించిన నీ యశోమహిమ సామాన్యంబె వర్ణింపగన్.

రసవంతంబగు వాక్కలాపముల సంరంభించి వ్యాజ్యంబులో
సిసలౌ గుండెనునొడ్డి, కక్షకుల ధ్వంసీభూతముంజేసి, ధై
ర్యసముద్రంబుననోలలాడి, గత వర్షప్రాంతమున్ స్వర్గపుం
దెసకేతెంచిన 'జాను' నాముడు, గుణోద్దీప్తుండు నా తండ్రి, త
ద్యశునింగాంచి వచింపుమో ప్రభు మదీయ క్షేమవార్తన్ కృపన్.

తనరాజ్యంబును మీదుమిక్కలిగ విద్యాగంధ సౌభాగ్య వా
సనతోనింపఁదలంచి మెచ్చిడిన పూజ్యస్థానముంబాసి నం
దున మైసూరునృపాలకుండలసి యెంతో దుఃఖసంతప్త వా
ర్ధిని దోగాడుచునుండె త్వద్విమల చారిత్రంబు శ్లాఘించుచున్.

ఆసలవారుదీర్చి విజయంబున ద్రవ్యము ప్రోగొనర్చి వి
శ్వాసబలానరెడ్డి జనసంఘము స్థాపనజేసి జాలిమై
గాసిలు పేదకుఱ్ఱలకు గౌరవవిద్యనొసంగి కీర్తి సిం
హాసనమందఁ గల్గిన మహా ఘనశాలివి నిక్కవంబుగన్.

చెలికాడై రసదిగ్ధ కావ్యరచనాక్షీరంబుబొంగించి, యాం
ధ్రులమెప్పించి కవీంద్రసంతతుల నెంతోప్రేమ బోషించి, నీ
స్థవికేతెంచిన విక్రమక్షితివరున్ దర్శించి భాషా ప్రదీ
ప్తుల వృత్తాంతము సంప్రదింపవలెబాబూ రామలింగాభిధా.

కవుల నుద్ధరించి కారుణ్య మర్పించి
తెలుగు కమ్మకలము వలపుజిమ్మ
పలుకుజుంటి తేనె పాకంబు వర్షించు
నిన్నువంటివాని నేనుజూడ.

పరమ పవిత్ర బావముల పాకముతో బొలివోనిబత్తి సం
బరమున నీచరిత్రమును వ్రాయగనోచిన నాకలంబె, దు
ర్మరణ విషాదకావ్యము సమాహిత దుఃఖదురంత సూచనా
భరమున వ్రాయనోచెను, అభాగ్యుడనై తిని క్రుంగి పోవుచున్.

మాటమాటకు హాస్యంబు మాటుబెట్టి
సభను కడుపుబ్బ నవ్వించు సమయచిహ్న
బాగ్యమరసిన సురల రంభయునునైన
హత్తుకొని గౌగలించి ముద్దాడు నిన్ను.

పూలు ధరించి భోగముల పొందికలో జగదేక కీర్తి వ
జ్రాల హారంగుతో విజయవంతముగాంచిన నాంధ్రవిశ్వ వి
ద్యాలయ కాంతనీ ఋణవిధానము దీర్చగలేనటంచు ను
త్తాల విషాదమందిన కతంబెటులారసి బుజ్జగింతువో.

ధరణి గతించినన్ ప్రకృతి ధర్మములన్ని నిమేషమాత్రలో
గురిసెడి దప్పిమాయమఱు గొందలమంది నశించినన్ శుభం
కరములు నాశనంబయిన గాని, మహోదయ మీనునట్టి నీ
చరితకు చావులేదు గుణసాంద్ర కవీంద్ర చకోరచంద్రమా.

ఉదయ సంధ్యారాణి ముదమారదిక్కుల
ప్రకృతి పద్యంబుల బాడునపుడు
చల్లదనాలతో సరసంబులాడుచు
క్రొంజలి గాడ్పులు గొట్టునపుడు
పచ్చికబీళ్ళలో బసిండి ఘంటముబూని
నవ్యకవిత్వంబు నడుపునపుడు
వలపులు మొలిపింపగల నిండుపండువె
న్నెల రంగసానితో గులుకునపుడు

ప్రేమ దమమూర్తికి నమస్కరించి పొంగి
రసము జిప్పిలు నీదు వర్తనము దలచి
నాంధ్ర జనయిత్రితోడ మాటాడుకొంచు
దుఃఖగీతుల బాడుకొందును కవీంద్ర.

---

ది ఓరియన్ట్ పవర్ ప్రెస్, తెనాలి

